# అభ్యుదయ

సాహిత్య మాస పత్రిక

# గోర్కీ ప్రత్యేక సంచిక



సంపాదకుడు

ఏటుకూరి ప్రసాద్

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం

3-6-737/3, హిమాయత్‌నగర్, హైదరాబాదు — 29.

## ఇలా ఉన్నాయి......



ముఖపత్ర చిత్ర రచన : శ్రీ లక్ష్మణ్

సంపాదకీయం

# గోర్కీ అడుగుజాడల్లో....

వామ పక్ష రాజకీయాలు తెలిసిన వారికి "అమ్మ" నవల అంటే విప్లవం. సాహిత్యాభిమానం కలవారికి "గోర్కీ" అంటే అమ్మ. విశ్వవ్యాప్తంగా విప్లవ కార్యాచరణలో కృషి చేస్తున్నవాళ్ళు బహుశా "అమ్మ" నవల ఇచ్చిన ప్రేరణను అనుక్షణం గుర్తు చేసుకుంటూ నూతనోత్తేజాన్ని పొందుతూంటారు. తన రచనలనూ జీవితాన్నీ శ్రామిక వర్గానికి అంకితమిచ్చిన గోర్కీ జీవితం; మన రచయితలకో గుణ పాఠం నేర్పుతుంది. ఎవరికీ అందకుండానూ, అందరికీ మంచిగానూ ఉండడం తాటస్థ్య అంటూ తమకు తామె నిర్వచించుకొన్న గాలివాయి రచయితలు మన మధ్య చాలా మంది ఉన్నారు. ఓ సందర్భంలో మార్క్స్ అనుకుంటా "పెట్టుబడి దారులు తమ గుడ్లను ఏదో ఒక్క సంచిలోనే ఉంచరు" — అని అంటాడు. ఈ రచయితలు అలాటి దార్శనికత ఉన్నవాళ్ళన్న మాట. గోర్కీ ఈ వాదాన్ని ఖండించాడు. శ్రామిక వర్గం పక్షాన రచయిత ఉండాలంటాడు. అన్యాయాన్ని, అహంకారాన్ని, అధికారబధిరాంధత్వాన్నీ సాహిత్యం ఎండ గట్టడామే కాదు వాటి పుట్ట కీట్టు కదల్చాలంటాడు. రచయితగా ఉంటూ రాజకీయల నధ్యయనం చేశాడు. రాజకీయాల్లో ఉంటూ రచనలు సాగించాడు. జీవన సమరంలో ఆటు పోట్లకు గురవుతూ సాహితీ సృజన చేపట్టాడు. ఇవన్నీ జీవితంలో ముప్పేటగా కలిసిపోవడం గోర్కీ జీవితంలో మనం చూడచ్చు. శ్రామిక జన రాజ్యానికీ విశ్వమానవ సౌభ్రాతృత్వానికీ రచయిత ఎంత బాధ్యతాయుతమైన పాత్ర నిర్వర్తించాలో—అదెంత కష్టసాధ్యమైనా అభ్యుదయ రచయితకుదాని ఆవశ్యకత ఎంతో ఈ ప్రత్యేక సంచికలోని వ్యాసాల్లో పలువురు వివరించారు, అనేక సందర్భాల్లోను అనేకులు రాసిన వివిధ గ్రంథాల్లోని విశేషాలను కొన్ని ఈ సంచిక కోసమే రాసిన వాటినీ సేకరించి ఈ ప్రత్యేక సంచికను రూపొందించడం జరిగింది. యువ రచయితలకు గోర్కీ గురించి దిఙ్మాత్రంగా పరిచయం చెయ్యడం దీని ఉద్దేశం.

# గోరి జీవితంలో ...

1868 మక్సిమ్ పెష్కోవ్, వర్వరాదంపతులకు మార్చి 16న, జననం

1871 జూలైలో తండ్రి మ:ణం,

1876 జనవరి–ఫిబ్రవరి, పాఠశాల ప్రవేశం. చిన్నమ్మవారు వ్యాధి రావడంతో మానేయడం.

1878 3వతరగతితో స్కూలు జీవితం సమాప్తం.కథలుచదవడం ప్రారంభం

1879 ఆగస్టులో తల్లి మరణం

1885 మే–జూన్, గేట్ కీపర్‌గా ఉద్యోగం

1889 అక్టోబర్-లాయర్ దగ్గర ఉద్యోగం

1892 జనవరి-సెప్టెంబర్ "ది మెయిడన్ అండ్ డెత్" అన్నకవిత్వంరాయడం

1893 ఆగస్టు 5(18) "ఏమెల్యాన్" కథ రుష్కీ వెదొమొస్తి పత్రికలో ప్రకటించడం,

1896 ఆగస్టు ఎకతెరినా ఒల్గినాతో వివాహం, జూలైలో కొడుకు పుట్టడం,

1898 మార్చి స్కెచస్ అండ్ స్టోరీస్ మొదటి సంపుటం అవతరణ.

1899 ఫిబ్రవరి, ఫోమ గొర్దెయెవ్ పత్రికలో ప్రచురణ

1900 లియో టాల్‌స్టాయ్‌తో పరిచయం.

1901 ఏప్రిల్, విప్లవ కార్యాచరణ వల్ల మళ్ళీ అరెస్టు. కూతురు జననం

1905 జనవరిలో మళ్ళీ అరెస్టు నవంబర్‌లో మొదటిసారిగా లెనిన్‌తో పరిచయం

1906 జూన్, అమ్మ నవల ప్రారంభం. డిశంబర్‌లో అమ్మ మొదటి భాగం అమెరికన్ పత్రికలో ప్రచురణ.

1907 ఏప్రిల్, న్యూయార్క్‌లో అమ్మ నవల విడుదల

1910 మత్‌వెయి కొయిమ్యాకిన్ నవల మొదటి భాగం ప్రచురణ,

1913 మార్చి, ది మాస్టర్ ప్రచురణ. ఆగస్టు- డిసెంబర్, 'బాల్యం' ప్రచురణ

1815 మే-అక్టోబర్- లెటోపిస్ పత్రిక బాధ్యత స్వీకరణ, డిసెంబర్‌లో మొదటి సంచిక రావడం.

1917 ఏప్రిల్, నొవయాజిన్ పత్రికా సంపాదక వర్గ సభ్యత్వం.

1921 అక్టోబర్, లెనిన్ సలహాతో చికిత్సకోసం విదేశ ప్రయాణం

1936 జూన్ 18న ఉదయం 11-10 గంటలకు మరణం



శ్రీ బి. హెచ్. వెంకటసుబ్బయ్య,
ఎం. కాం.

వీరు హైద్రాబాద్‌లోని శంకర్‌లాల్ ధనరాజ్ సిగ్నోడియా ఆర్ట్స్, కామర్స్ కళాశాలలో వాణిజ్య శాస్త్ర ఉపన్యాసకులుగా ఉంటున్నారు. మార్కాపురం నివాసి. గ్రంధ సేకరణ-అధ్యయనం వీరి అభిరుచులు. మొదటి నుండి పలు సంస్థలకూ - వ్యక్తులకూ గుప్తదానం చేసే అలవాటున్న వీరు అభ్యుదయ సాహిత్యాభిమాని. ఈ ప్రత్యేక సంచికకు రు. 2000/- విరాళ మిచ్చి సహకరించిన వీరికి అభ్యుదయ కృతజ్ఞతలు.

వ్యాసం

# కొల్లబోయిన రష్యన్ సాహిత్యం

–రాంభట్ల కృష్ణమూర్తి

లెనిన్ ఆదేశం మేరకు గోర్కీ ఒక రాజభవనం లాంటి ఇంట్లో చేరాడు. గోర్కీ రష్యన్ జాతీయుడు. ఆ బిరుదు ఎవ్వరూ ఇవ్వలేదు. కానీ రష్యన్ జాతి యావత్తు అలాగే భావించింది. లెనిన్ కూడా అలాగే భావించాడు, మానవ మస్తిష్కాలకు ఇంజనీర్ల లాంటివాళ్ళు కవులు. అన్నది లెనిన్ భావం. ఆభావన ప్రకారం గోర్కీ నవసోషలిస్టురాజ్యానికి ఛీఫ్ఇంజనీరు. అయినప్పుడు ఆయనకో కార్యాలయం కావాలి. అదే ఆ రాజభవనం. కార్యాలయం ఉన్నప్పుడు ఇంజనీరకి ఒక సెక్రటరీ కావాలి. కార్యనిర్వహణకు ఒక మేనేజర్ కావాలి. సెక్రటరిగా గోర్కీ కుమారుణ్ణి నియమించారు. ఆభవనం మేనేజరుగా కోడలిని నియమించారు. గోర్కీకి పర్సనల్ అసిస్టెంట్ గా ఆయన భార్య స్వయంగా నియుక్తమైంది. హోదా పెద్దదే అయినా కార్యాలయ సిబ్బంది మాత్రం చిన్నదే. లోకం దృష్టిలో అది చిన్న కుటుంబం కానీ సోషలిస్టు అధినేత దృష్టిలో అదో కార్యాలయం,

గోర్కీ అసలు పేరు మక్సిమ్. మనవాళ్లు దాన్నే మాక్సిమ్ అంటూ ఉంటారు. ఆయన తండ్రి పేరు కూడా అదే మక్సిమ్. రష్యన్ సంప్రదాయం కూడా ఒక విధంగా మన సంప్రదాయం లాంటిదే పోతే ఇంటిపేరు మాత్రం మనకు ఆదిలో ఉంటుంది. వాళ్ళకు ఆఖర్లో ఉంటుంది. అంతే తేడా. ఆయవింటి పేరు పెష్కోవ్. ఇప్పుడు పూర్తి పేరు చెప్పాలంటే తెలుగులో అయితే పేష్కోవు మక్సిమ్‌గారి మక్సిమ్ అనవచ్చు, దాన్నే రష్యన్‌లో మక్సిమ్ మక్సిమోవిచ్ పెష్కోవ్ అంటారు. అయితే ఆ ఇంటిపేరు ఏనాడోమాసిపోయింది. ఆయన పెట్టుకున్న కలం పేరు. గోర్కీ అదే ఆయన ఇంటిపేరుగా అసలు పేరుగా చలామణిలోకి వచ్చింది. ఆ కలం పేరు పెట్టుకోవడానికి కూడా ఒకకారణం ఉంది. ఆ కారణాన్ని పరిశీలిస్తే మనకు సమాజ పరిణామంలోని సత్యం గోచరిస్తుంది.

ఇప్పుడు సత్యాన్ని ఎందరో ఎన్నో విధాలుగా వ్యాఖ్యానిస్తుంటారు ఆ వ్యాఖ్యానాల్ని విశ్లేషించి చూస్తే సత్యం మూడు యుగాల్లో ముత్తెరగులుగా కనిపిస్తుంది. ఫ్యూడల్ యుగంలో సత్యాన్ని గొప్పగా వ్యాఖ్యానించాడు వ్యాసుడు. "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ న బ్రూయాత్ సత్యమప్రియం" అని ఆయన శాసించాడు. దాన్ని తిక్కన్న గారు "సత్యము ప్రియమును హితమును" అని అనువదించాడు. అంటే ఆ రోజుల్లో రాజుగారి చనవర్లు మనవర్లు పలికే సత్యం మాత్రమే అక్షరాల కెక్కేది. మిగతావారు ఎన్ని సత్యాలు చెప్పినా అవన్నీ గాలికి పోయాయి. మనకు దక్కలేదు. రాజుగారి చనవర్లు మనవర్లే సత్యం చెప్పేవాళ్ళు కనక ఆ సత్యం రాజుకు ప్రియము, హితముగా ఉండాలి లేకపోతే సత్యం పలికిన కంఠానికి గండ కత్తెర పడుతుంది. ఈనాటికీ చాలామంది తలకాపాడుకోవాలంటే అలాంటి సత్యాన్నే పలుకవలసి వస్తోంది. లేకపోతే కంఠానికి గండకత్తెర తప్పదు. దీన్ని నేను ఫ్యూడల్ సత్యమంటాను, తలకాపాడుకోవాలంటే నేటికీ ఫ్యూడల్ సత్యం తప్పను, అలాంటి దశలో ఉన్నవారికి "సాహసం శాయరా ఢింబకా" అని ఎవరూ చెప్పడం కూడా మంచిదికాదు. అది ప్రియ సత్యం. అలా సాహసం చేసిన ఢింబకులు ఇప్పటికీ అప్రియ సత్యం చెప్పకు నేస్తం అని హెచ్చరికలు చేస్తూనే ఉన్నారు.

తరువాత యుగ సత్యాన్ని నిర్వచించిన వాడు రెడ్యుయార్డ్ కిప్లింగ్. ఈయన బ్రిటిషు సామ్రాజ్యవాద 'ప్రవక్త' 'తూర్పు తూర్పె పడమర పడమరే ఈ రెండూ ఏనాటికీ కలవదు' అన్న మహా సూక్తిని వచించింది. ఈ కిప్లింగ్ దొరగారే. "సత్యం ఒకనగ్న జవ్వని లాంటిది. ఆమెను పది నిలువులలోతుల్లోంచి పైకి తెచ్చి పెద్ద మనుషుల ఎదురుగా నిలబెడితే వారు "హా! శ్రీహరి" అని ఓరమోమైనా పెడతారు, అచ్చు అద్దకపులంగా అయినా ఆమె మీద కప్పుతారు" అన్నాడా మహానుభావుడు. దాన్నుంచే నగ్న సత్యమన్న మాట పుట్టింది. బడెబాధల జవరాల్ని ఒంటరిగా చూడ్డానికి ప్రతీ పెద్దమనిషికీ ఇష్టమే! కానీ నలుగుర్లో చూపినప్పుడే ఓరమోములు అద్దకపులంగాలు అవసరమవుతాయి. ఈ సంగతి కూడా నేడు నగ్న సత్యాలు ప్రవచించే చాలా మందికి అమలవైద్య వేద్యం పేరుకు వాళ్ళు నగ్న సత్యమంటారుగానీ, దాన్నెప్పుడు అచ్చులంగాలోనే చూపి

స్తారు. అదే చిత్రం. దీన్ని నేను భూర్జువా సత్యమంటాను. చాలామంది మెచ్చుకునే దిగంబర కవిత్వం కూడా అచ్చులంగా కట్టుకున్న సత్యం మాత్రమేనని నేనంటాను ఇలా అన్నందుకు కొందరు ఆగ్రహిస్తారని నాకు తెలుసును. మరి కొందరు ఆక్రోశిస్తారని కూడా నాకు తెలుసు. ఎవరేం చేసినా ఇది భూర్జువా సత్యం మాత్రమే.

నిజం ప్యూడల్ సత్యంలా ప్రియంగానూ, హితంగానూ ఉండదు. భూర్జువా సత్యంలా నగ్నంగానూ ఉండదు అదెప్పుడూ చేదుగానేఉంటుందంటారు గోర్కి. అదినిన్ననూ చేదు నేడూ చేదు. రేపుకూడా చేదే. అదే సాహిత్యకారులకు కావాల్సిన నిత్య సత్యం, దాన్ని అప్పుడప్పుడు కొందరు చేదు నిజం అంటూ ఉండడం కూడాకద్దు. దాన్ని కొందరు పండితులు కటు సత్యం అని అనువదిస్తుంటారు. కటువంటే కారమే కాని చేదుకాదు. ఇక్కడ నేను రచయితల "రస" చర్చ చేయదలచుకోలేదు.

సత్యానికి గల ఈ ప్రత్యేకతను గమనించిన గోర్కి తనకలంపేరు ఎన్నుకున్నాడు. గోర్కి అంటే రష్యన్ భాషలో చేదు అని అర్థం. దాన్ని మనభాషలో రాయడం ఉచ్చరించడం కూడా కష్టం. మనం నేడు ఉచ్చరించే రీతిలో గోర్కి అంటే కొండ అని అర్థం "గోర్కి–ఇ" అన్న వర్ణక్రమం ప్రకారం అయితే చేదు అని అర్థం. ఈ వర్ణక్రమ ప్రకారమే ఉచ్చరిస్తారువారు, దీన్నినేను పోష లిస్టు సత్యమని, నిత్య సత్యమని పిలుస్తాను. ప్రసక్తాను ప్రసక్తంగా ఈ కథా సంబంధిగానే ఇంతలా సత్యమీమాంస చెయ్యవలసి వచ్చింది.

గోర్కి కొడుకు పేరు కూడా మక్సిమే. అందువల్ల ఆయన పూర్తి పేరు మక్సీమ్ మక్సిమోవిచ్ పెష్కోవ్. ఆయన గొప్ప ఇంజనీరు. ఎన్నో గొప్ప ప్రాజెక్టులు కట్టాలని కలలు కన్నాడు. ఆయన భార్య నౌకా శిల్పి. ఆమె కూడా ఎన్నో కలలు కంది. వారి మానాన ఇద్దర్నీ విడిచి పెడితే ఎంతగొప్ప వాళ్ళయ్యే వారో ఏమో ; లెనిన్ పలుకున వారి కొత్త కొలువున చేరవలసి వచ్చింది. ఆ దంపతులకో చిన్న పాప. ఆ పాపంటే గోర్కికి ప్రాణం. ముచ్చటయిన సంసారమది. అంతకన్నా ముచ్చటయిన కార్యాలయమది. గోర్కి లైబ్రరీలో 36,000 గ్రంథాలున్నాయి. అందులో ఏ పుస్తకం లాగి చూసినా పేజీ మార్జినులో

గోర్కీ వ్యాఖ్యలు కనిపిస్తుంటాయి. 24,000 ఉత్తరాలకు ఆయన జవాబులు రాశాడు. అందులో 16,100 పైగా ఆయన స్వదస్తూరితో ఉన్న ఉత్తరాలు. మిగతావి సెక్రటరీ టైపు చేయగా ఆయన సంతకాలు పెట్టినవి. పాపం సెక్రటరీకి, హౌస్ కీపరుకు 'ఈ కార్యాలయం' లో ఊపిరాడని పని వారికి అసిస్టెంట్లు ఎవరూ లేరు ఎప్పుడయినా ఉంచేగించే శ్రీమతి గోర్కీయే వారి అసిస్టెంటు. అంతే కాదు ఆమె తమ వాసుల బేబీ సిట్టర్ కూడా.

ఇలాంటి పచ్చని కార్యాలయంలో ఒక రోజు పిడుగుపడింది గోర్కీ సెక్రటరీ ఏకైక కుమారుడు మక్సిమ్ మక్సిమోవిచ్ పెష్కోవ్ హఠాత్తుగా కన్ను మూసాడు. 'ఛీఫ్ ఇంజనీరు' గోర్కీ తలపట్టుకొని కుమిలి కుమిలి విలపిస్తున్నాడు. దేశంలోని పెద్దపెద్ద 'ఇంజనీర్లం'తా ఆయన్ని ఆశ్వాసించడానికి అక్కడ గుమికూడారు.

"పెద్దవాడవు నీవే ఇలా కుమిలిపోతే ఆ పాపను, ఆ వృద్ధ మాతను, ఆ కోడల్ని ఊరడించే వాళ్ళెవరు గోర్కీ" అని అంతా అనునయిస్తున్నారు. గోర్కీ తేరుకున్నాడు అందర్నీ కలియ జూశాడు ములుకుల్లాంటి చూపులతో అందర్నీ గుచ్చి గుచ్చి చూస్తున్నాడు. అంతలో చేదుగా ఒక చిన్న నవ్వు ఆయన పండు మీసాల సందులోంచి తళుక్కుమంది దుఃఖం దిగమింగారు. గొంతు సవరించుకున్నాడు. మళ్ళీ మామూలు గోర్కీ అయ్యాడు.

ఒకసారి నేను ... అని ఏదో చెప్పడానికి ఉపక్రమించారు. ఒక సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షుడుగా రమ్మంటే సైబీరియా వెళ్ళాను. అసలు రష్యాయే మింగుడు పడకుండా ఉంటే, అక్కడ మిమ్మల్ని తప్ప మన్నసలు కానరాదు. నన్ను చూడాలనేవారు, నాతో మాట్లాడాలనే వారు అక్కడ చాలామంది ఉన్నారు. నేను తిరిగి రావడానికి రెండు మూడు వారాలు పట్టవచ్చునని ముందే చెప్పాను. తిరిగి వచ్చేసరికి ఇక్కడ ఉత్తరాలు బాగా పేరుకొన్నాయి అవన్నీ ఒకటొకటే చూసి జవాబులు డిక్టేట్ చేశాను ఏవో ఒకటి రెండు పత్రికలు కూడా ఉన్నాయి. అవి తర్వాత చూద్దాంలే అని పక్కన పెట్టాను ఇంతలో ఒక పత్రికా కార్యాలయం నుంచి నేను రాసిన కథకు పారితోషికంగా పాతిక రూబుళ్ళు మనియార్డరు

వచ్చింది సంతకం పెట్టి తీసుకున్నాను. పత్రికా కార్యాలయం విలాసం చూశాను. ఆ పత్రికకు నేనెప్పుడూ కథ రాసిన గుర్తు లేదు. అయినా నా పేరుతో పారితోషికం వచ్చింది. ఆశ్చర్యం వేసింది. అబ్బాయి అదే సెక్రటరీ లోపల టైపు కొడుతున్నాడు. పక్కనపెట్టిన పత్రికల్ని చూశాను అందులో నాకు పారితోషికం పంపిన పత్రిక కూడా ఉంది నేను రాసిన ఏ కథను పత్రికవాళ్ళు అచ్చు వేశారు. నేను ఎంత ఆలోచించినా నాకు గుర్తు రాలేదు. అందులో ఒక కథ కనిపించింది. దానిమీద మక్సీమ్ గోర్కీ అని నాపేరే ఉంది. కుతూహలం ఆగలేదు, నాకు తెలియని నాకథ ఏమిటాని ఒక్క గుక్కలో చదివాను. కథ చాలా గొప్పగా ఉంది. ఇంత గొప్ప కథను నేనే రాశానా? అనిపించింది. కథ శీర్షిక కింద నాపేరే ఉంది. ఆ కథ రాసిన గుర్తు లేదు మళ్ళీ చదివాను. ఇంత గొప్ప కథ రాయడం నాకు సాధ్యం కాదనిపించింది. ఉత్తరాలు టైపు చేయడం పూర్తి అయింది. మక్సీమ్ తిరిగొచ్చాడు. ఈ కథ ఏమిటి? నేనెప్పుడు రాశాను? ఇలా రాయగలనా నేను? ఈ పత్రిక్కి ఎలా వెళ్ళింది. అని గుక్క తిప్పుకోకుండా ప్రశ్నలు కురిపించాను. మక్సీమ్ అదే చిరంజీవి మక్సీమ్ ఆ పత్రికను తాపీగా తిరగేశాడు. ఆ కథ చదివాడు. నా వైపు చూశాడు. అక్కడ ఉన్న మనియార్డరు కూపన చూశాడు. మక్సీమ్ ముఖంలో గాంభీర్యం అలుముకొంది. గొంతెత్తాడు. నాన్నా అన్నాడు. అతని కళ్ళలోకి చూశాను. ఆ కళ్ళల్లో ఎన్ని అర్థాలున్నాయో నాకంతు పట్టలేదు.

నువ్వు నా జీవితాన్ని దోచుకున్నావు. ఆఖరికి తీరిక దొరికింది కదాని ఒక కథ రాశాను. ఆ కథను కూడా నువ్వే దోచేసుకున్నావు. ఎలాగూ కొల్లబోయాను. ఇప్పుడేమని లాభం లేదు కనక.... అని ఆగాడు. గోర్కీ తలెత్తి ప్రశ్నార్థకంగా కొడుకు ముఖంలోకి చూశాడు. నీకొచ్చిన పాతిక రూబుళ్ళలో సగం నాకిచ్చేసెయ్యి. నీ పేరు మీద వచ్చింది కాబట్టి మిగతా సగం నీది. పెష్కో పెదవుల మీద ఒక కొంటె నవ్వు కనిపించింది. కళ్ళలో చిలిపితనం తళుక్కుమంది. జేబులోనుంచి తీసి పన్నెండున్నర రూబుళ్ళు లెక్కపెట్టి టేబుల్ మీద పెట్టాను.

తర్వాత తెలిసింది ఆ కథ నా కొడుకు రాశాడని. రచయితగా మక్సీమ్

మక్సిమోవిచ్ పెష్కోవ్ అని పేరు పెట్టుకున్నాడు? దాన్ని ఆ పత్రికకు పంపించాడు, తర్వాత ఆ పత్రికా సంపాదకుడు చెప్పాడు, ఈముసలాయనకు అప్పుడప్పుడు మతి పోతుంటుంది కొన్ని దశాబ్దాల నుంచి మక్సీమ్ గోర్కీ అని రాస్తున్నాడు, ముసలాయనకు మతి పోయిందా పెష్కో అని పాత పేరు పెట్టుకున్నాడు. అందులోనూ ఇంతమంచి కథకి. అని ఆలోచించి ఆ పేరును కొట్టేసి మక్సీమ్ గోర్కీ అని రాశాడట సంపాదకుడు. అదీ అసలు సంగతి, అందువల్ల అతడు రాసిన ఒకేఒక కథకు కూడా నా పేరే వచ్చేసింది — అన్నాడు గోర్కి. ఇప్పుడు చెప్పండి నేను రాయలేను అనిపించినంత గొప్ప కథను రాసిన కథకుడు పోయాడు. వాడి మరణంతో రష్యన్ సాహిత్య సరస్వతి ఎంత పేదరాలయి పోయిందాని తోచి ఏడుస్తున్నాను. నా ఒక్కగా నొక్క కొడుకు పోయినందుకు కాదు. అని భోరుమన్నాడు గోర్కి. ఆ కథ వినగానే ఊరడించ వచ్చిన సాహితీ మూర్తులందరూ భోరుమన్నారు. వారందర్నీ ఊరడించే వారెవరు. కొల్లబోయిన రష్యన్ సాహితీ సరస్వతిని ఊరడించేవాళ్ళెవరు?!





✽ శ్రామికవర్గం అంటోంది : మా చేతిలో సాహిత్యం ఒక సాంస్కృతిక ఆయుధం కావాలి. అది మా గమ్యం చేరుకోడానికి మాకు సహాయపడాలి. ఎందుకంటే మేం వెళ్ళే మార్గం మానవాళికంతటికీ ఉమ్మడిగా చెందింది.

— గోర్కి

x x x x

✽ గోర్కి హృదయం నూతన సారస్వత ఫలకపైన చిత్రించి ఉంది. ఆ హృదయంలో సర్వ ప్రపంచశాంతి ఉంది.

— కిషన్‌చంద్



# శ్రామికవర్గ రచయిత

## — గోర్కీ

పాక్రోవ్స్కి పట్టణంలోని ఒక సాంకేతిక పాఠశాల సాహిత్య బృందసభ్యులకి రాసిన ఉత్తరం.

ప్రియమైన కామ్రేడ్స్! నేను "శ్రామికవర్గ" రచయితనా లేక "శ్రామిక వర్గేతర" రచయితనా అని విమర్శకుల మధ్య వున్న వాదోపవాదాలతో నా మట్టుకి నాకు యేమీ ఆసక్తి లేదు ఉత్సవ సందర్భంగా నాకు వచ్చిన అసంఖ్యాక అభినందనల్లో శ్రామికులు ఏకకంఠంతో నన్ను "మా వాడివ"నీ, "శ్రామికుణ్ణి"నీ, "కామ్రేడ్" అని సంభోదించారు. శ్రామికుల వాణి నాకు విమర్శకుల మాటకంటే యెంతో ముఖ్యమైంది, శ్రామికులు నన్ను పరాయివాడిగా కాకుండా తమ "కామ్రేడ్"గా పరిగణిస్తున్నందుకు నేను నిజంగా గర్విస్తున్నాను. ఇది నాకు నిజంగా గర్వకారణమూ, గౌరవమూనూ.

"శ్రామిక" అనే పదానికి సంబంధించినంతవరకూ, అది సోవియట్ యూనియన్ శ్రామిక జనం వున్న వాస్తవ పరిస్థితితోటి పూర్తి అనుగుణంగా లేదని నాకు అనిపిస్తోంది.

"శ్రామిక వర్గం" అనేది తమ శ్రమశక్తి మీదనే బతుకుతూ, మరే యితర జీవనాధారమూ లేని ప్రజల వర్గమని మీకు తెలుసు. అయితే ఆ పదాన్ని యీ అర్థంలో మన దేశంలో రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకుని, యిప్పుడు క్రమేపీ దేశపు ఆర్థిక స్థితినీ, సంపదనీ అజమాయిషీలోకి తీసుకుంటూ వున్న శ్రామికజనానికి సోవియట్ యూనియన్ కార్మికులకీ, రైతులకీ అన్వయించవచ్చా? దీనికి సమాధానం చెప్పడం మీ వంతు.

"యే లక్షణాలని బట్టి నిజమైన శ్రామికవర్గ రచయితని గుర్తించవచ్చు?" అని మీరు అడుగుతారు. అలాంటి లక్షణాలు చాలా వున్నాయని నేను అనుకోను. ఆ లక్షణాలు యివి: మానవుణ్ణి అంతరికంగా, బాహిరంగా ఉభయత్రా పీడించే ప్రతిదాన్నీ, మానవుడి-సామర్థ్యాలు స్వేచ్ఛగా పెరిగి అభివృద్ధి చెందకుండా ఆటంకపరచే ప్రతిదాన్నీ క్రియాత్మకంగా రచయిత ద్వేషించడం; సోమరిపోతుల పట్లా, పరాన్నభుక్కుల పట్లా, నీచుల పట్లా, ఇచ్ఛకాలమారుల పట్లా, అనేక రూపాల్లో వుండే ప్రతిదుష్టుడి పట్లా మొత్తంగా నిర్దాక్షిణ్యమైన ద్వేషంవుండడం.

సృజనాత్మక శక్తికి ఆధారభూతులుగా, సర్వరకాల వస్తువులనీ ప్రపంచం

లోని సకల అద్భుతాలనీ సృష్టించేవాడుగా, ప్రకృతి విపత్తులకి వ్యతిరేకంగా పోరాదేవాడుగా, తన భౌతిక శక్తులు నిరర్థకంగా వ్యయం కాకుండా వుండేందుకు గాను — వర్గ దేశపు పరిస్థితుల్లో ఈ వ్యయం విధిగా తెలివి తక్కువ, పనికిమాలిన న్యాయంగా వుండేది —తన శ్రమవల్లా, శాస్త్ర సాంకేతిక జ్ఞానంవల్లా "విశ్వామిత్ర సృష్టి" చేసినవాడుగా మానవుడి పట్ల రచయితకి గౌరవం వుండటం.

అహేతుక దోపిడీని. ఒక మనిషిమీద మరొక మనిషి పెత్తనాన్ని పూర్తిగా తొలగించి వేసేటువంటి నూతన జీవిత రూపాల సృష్టి ధ్యేయంగా కల సమష్టి శ్రమని రచయిత కవితాత్మకం చెయ్యడం.

శారీరక సౌఖ్యప్రదాయినిగా కాకుండా జీవిత కష్టభూయిష్ఠ పథం మీద విశ్వాసపాత్రమైన సహచరిగా, సహాయకురాలిగా స్త్రీల పట్ల రచయిత దృక్పథం వుండటం.

పిల్లల పట్ల బాధ్యతా దృష్టి వుండటం. మనం చేసే ప్రతి పనికీ మనం వాళ్ళకే బాధ్యులం అనే వైఖరి వుండటం.

జీవితం పట్ల పాఠకుల క్రియాశీల దృష్టిని పెంచి, శ్రమ సంతోషాన్నీ దాని మహత్తర ప్రాముఖ్యాన్నీ జీవితపు మహత్తర భావాన్నీ అర్థం అవకుండా అడ్డగించే ఆంతరికమైన, బాహిరమైన దాస్యాంతటినీ జయించేటువంటి తమ సామర్థ్యం పట్లా తమ శక్తి పట్లా, వాళ్ళకి విశ్వాసాన్ని కలిగించేందుకు రచయిత ప్రయత్నించడం.

యిదీ సూక్ష్మంగా శ్రామిక ప్రపంచానికి అవసరమైన రచయితని గురించి నా అభిప్రాయం.

శ్రామిక ప్రపంచంలో అధికారేచ్ఛ జాగృతం అవుతోందనీ, యీ క్రమం ప్రపంచమంతటా ఒక్క యూరప్‌లోనే కాకుండా ఆసియా, ఆఫ్రికాలలో కూడా వుందనీ మీకు తెలుసు.

మరి మీరు, సోవియట్ యూనియన్ శ్రామికుల అగ్రగాములైన మీరు, ప్రపంచ శ్రామికజనానికి ఒక ఉదాహరణ, ఆదర్శమూ అని, లక్షలాది కళ్లు మీకేసే చూస్తున్నాయనీ, లక్షలాది చెవులు మీరు చెప్పేది వింటున్నాయనీ తెలుసు కోవాలి.

మానవుడి పట్ల నూతన దృష్టిని ప్రచారం చేసే వాళ్లుగా, నూతన జీవిత

నిర్మాణ బోధకులుగా వుండేట్టు, మీమీద, యువజనం మీద, చరిత్ర బాధ్యత మోపింది. మొదటి విషయంగా మీరు కష్టించి అధ్యయనం చేసే పూచీ మీ మీద వుంచుతోంది అది వ్యక్తి యెంత తెలుసుకుంటే అంత బలవంతుడవుతాడు. అది పర్యవాద, తన లక్ష్యం యెంతటి మహత్తరమైందీ, యెంత గంభీరమైందీ అన్న పరిజ్ఞానం మనిషిని యింకా దృఢతరం చేస్తుంది.

అప్పుడు చవకబారు "జీవిత క్షుద్ర విషయాలు," పాత విశ్వాసాలు, మురికి "శతాబ్దాల ధూళి," "సంస్కార హీనత్వపు" లజ్జాకరమైన మనస్తత్వం. "పెటీబూర్జువాతత్వం"— యివేమీ కూడా రచయితకి సంబంధించి ఆస్తిత్వంలో వుండవు, అతన్ని సోకలేవు.

రచయిత "క్షుద్ర విషయాల" విషపూరితమైన చెత్తకి లొంగకూడదు. అతను దానికి వ్యతిరేకంగా అకుంఠితంగా పోరాడాలి. "జీవితపు క్షుద్ర విషయాలు" తనని ఆటంకపరిచి అడ్డగిస్తున్నాయని అతను ముక్కి మూలగకూడదు. నిత్యజీవితంతోపాటు ప్రతివాళ్ళనీ అడ్డగిస్తాయనీ, రొప్పు పడడం వ్యర్థం అనీ, అకుంఠిత పోరాటమూ సంతోషభరిత శ్రమ మాత్రమే మన జీవిత కష్టాలన్నిటినీ అధిగమించేట్టు చేస్తాయనీ అతను తెలుసుకోవాలి.

మనిషి జన్మతః "దుష్టుడు" కాదనీ, వర్గ వ్యవస్థ అనే యేహ్యమైన సామాజిక నిర్మాణంవల్ల అతను భ్రష్టుడవుతున్నాడనీ రచయిత నిస్సంకోచంగా యెరిగి గుర్తుంచుకోవాలి. యిలాంటి వ్యవస్థ హింస లేకుండా. వుండలేదు, అసూయని. పగని, సోమరితనాన్ని రెచ్చగొట్టకుండా వుండలేదు, బలవంతమూ. తరచూ వ్యర్థమూ అయిన శ్రమ పట్ల వైముఖ్యాన్ని సులభ లాభం పట్లా, చవకబారు మురిగిపోయిన సుఖాల పట్లా, విషయ లౌల్యం పట్లా, సురాపానం యింకా తదితర చవకబారు కుచేష్టల పట్లా ఆకర్షణనీ కలిగించకుండా వుండలేదు

తాము చెప్పున్నట్టు మానవుడు "జన్మతః చండాలుడనీ", నీచత్వం అనేది వాడి శరీరంలో. పాశవిక సహజాతాల్లో వుంటుందనీ, అది 'రాక్షస' ప్రేరితమనీ, సకల మానవ చర్యలూ కూడా మానవ అంతరాత్మని స్వాధీనం చేసుకోడానికి అనాదిగా జరుగుతూ వున్న దేవదానవ పోరాటపు "ప్రతిఫలన" మనీ నొక్కి చెప్పడం తమకి లాభసాటి అవసరంగా వుందని భావించే మనుషులు వున్నారని యువజనులైన మీరు తెలుసుకోవాలి, గుర్తుంచుకోవాలి.

ఉన్నత జీవితంకోసం మానవుడికిగల యిచ్ఛని, శ్రమనీ సృజననీ విముక్తం

చెయ్యాలన్న యిచ్ఛని పరిమితంచేసి, చంపెయ్యాలన్న కోరిక, మనిషిని వర్గసమాజపు బానిసగా పెంచాలన్న కోరిక అలాంటి ఉద్బోధకి ఆధారం. అది మనిషిని ఒట్టి ముడి పదార్థంగా, గొడ్డళ్లూ, గొలుసులూ, సంకెళ్ళు లాంటి నానా రకాల పనిముట్లు పరికరాలూ చేసుకోవడానికి వీలైన ముడి ఖనిజంగా పరిగణిస్తుంది;

యీ సిద్ధాంతాన్ని ప్రచారం చేసే వాళ్లు కూడా 'వంచకులే' అంటే నిజాయితీపూర్వకమైన, క్రియాత్మకమైన, శ్రమించే జీవితానికి అనర్హులు, శ్రామిక జనాలకి అల్పమూ, అవమానకరమూ అయిన జీవిత రూపాలకి భిన్నమైన పాటిని వూహించలేని, వూహించాలని ఇష్టంలేని వాళ్లు "జన్మతః వున్న లేదా రాక్షసప్రేరిత దుష్ట సహజాతాల సిద్ధాంతం, "అనాగరీకులు'' అని పిలిచేటువంటి వాళ్లు, ఆఫ్రికన్ నీగ్రో తెగలు, లేదా సైబీరియన్ తెగలు–జాకుత్‌లు, బుర్యాలు, తుంగుస్‌లు-వాస్తవానికి మానవజాతుల శాస్త్రజ్ఞులు చూపించినట్టు చాలా దయగల మనుషులన్న యదార్థం వల్ల సులభంగా వమ్ము అయిపోయింది.

యింకొంచెం ధర్మ పరాయణులూ లేదా యింకొంచెం కుటిలురూ అయిన యీ బోధకులు కనిపెట్టిన అత్యుత్తమమైంది యేమంటే "పరిణామవాదం," సామాజిక వ్యవస్థ జీవిత రూపాల మందమైన, క్రమానుగతాభివృద్ధి.

కాని ధర్మమూ, కౌటిల్యమూ వాళ్ళకి దాదాపు ఒకటే పెట్టుబడిదారీ సమాజ "పరిణామం" అత్యంత ఆరోగ్యవంతులైన లక్షలాది మనుషులకు నాశనం చేసిన నాలుగు సంవత్సరాల క్రూరమైన హత్యలకి దారి తీసింది, యీ హత్యాకాండలోకి శ్రామికుల్ని, యీ "పరిణామపు" రక్షక స్వభావంలో నమ్మకం వున్న పోషలిష్టులని లాగింది· "సాంస్కృతిక"మైన యూరప్‌ని బ్రహ్మాండంగా అటవికంచేసి-ది రక్త పాతంలో కాసుల రాశుల్ని మూటకట్టుకున్న లెక్కలేనంత మంది మోసగాళ్లని తయారుచేసింది. మరో కొత్త యుద్ధాన్ని, యింకా భయంకరమైన దాన్ని, రప్పించే బెదిరింపులు చేస్తోంది, యిదంతా మీకు యిప్పటికే తెలుసు.

ఆఖరిగా, సామాన్య విరాయుధీకరణకి సోవియట్ యూనియన్ ముందు పెట్టినటువంటి ముసాయిదా సంధిని, పరిణామ సిద్ధాంతపు రక్షక స్వభావంలో నమ్మకం వున్న సాంస్కృతిక జనం తిరస్కరించారు అని మీకు తెలుసు,

నానా జాతి సమితి అప్రతిష్టాకరమైన పిరికితనం యూరపియన్ సంస్కృతికి దాని మానవ వ్యతిరేక సారాన్ని వెల్లడి చేసే వర్గ సమాజానికి గల కడపటి దివాళాకోరుతనం తప్పవేరేమీ కాదని మీరు గమనించి సదా గుర్తుంచుకోవాలి,

మీరు నిజాయితీపరులైన వాళ్ళు కావాలంటే విప్లవకారులు అవాలి. ❋

# శ్రామిక జనజీవన సంకీర్తన - మాక్సిమ్ గోర్కి

—మాడభూషి సంపత్‌కుమార్

ప్రపంచంలో రెండు రకాల మనుషులున్నారు బొమ్మల్లోలాగా అందమైన వాళ్ళు, నిజంగా అసహ్యంగా ఉండేవాళ్ళు అలాగే మనిషి సృజనలో కూడా రెండు రకాలున్నాయి. మంచి, చెడు. చాలామంది వాళ్ళు అందమైన జీవితాన్ని అనుభవిస్తూ. ఇతరులకు చెడు చేస్తుంటారు హీనమైనజీవితం గడుపుతున్నారనే నెపంతో మనుషుల్ని కొందర్ని అసహ్యించుకోవడాన్ని గోర్కి (16-3-1868) నిరసించాడు. వాళ్ళ బతుకుల్లో హీనత్వం చోటు చేసుకోవడానికి కారణాల్ని వెదికాడు. వాటి పైన తిరుగుబాటు చేశాడు దాన్ని రూపుమాపడానికి నిర్విరామంగా కృషి చేశాడు. ఆయన అందమయిన జీవితాన్ని వ్యతిరేకించలేదు, అది అందరికి కావాలనేదే ఆయన తపన.

సృష్టిలోని జీవరాసులన్నిటి కన్నా మనిషికి ఎంతో ప్రాముఖ్యమిచ్చాడు గోర్కి. అటువంటి మనిషి బాధపడ్డం మానవకోటికి సిగ్గుచేటని ఆయన భావన. అటువంటి బాధల్నుంచి మనిషిని కాపాడాల్సిన కనీస ధర్మం ప్రతిమనిషి మీదా ఉంది, అయితే ప్రపంచంలో అందుకు విరుద్ధంగా జరగడం గోర్కి సహించలేని విషయం. మనుషులకు కష్టాలు రావడానికి మనుషులే కారణం అంటే మానవజాతి కష్టాలను తలచుకుంటేనే కన్నీరు కార్చే గోర్కి ఎంత ఆవేశపరుడయ్యుంటాడో మన ఊహకందని విషయం. ఆయన రచనల్లో, మాటల్లో, పనుల్లో మనకు అది కనిపిస్తుంది. మనిషి లక్షల సంవత్సరాలనుండి అనేక జీవరాశుల్తో పోరాడి పోరాడి తన అస్థిత్వాన్ని. ఆధిక్యాన్ని నిలబెట్టుకో గలిగాడు. అయితే ఒక మనిషికి ఇంకొక మనిషి బానిస కావడం మానవత్వంతో ఆలోచించే ప్రతి మనిషికి ఆవేశాన్ని కలిగింపజేస్తుంది. ఆ ఆవేశాన్ని గోర్కి ఆయన రచనల్లో ముద్రించాడు,

సాహిత్యం మానవ పురోగతికి ఉపయోగపడాలనేది గోర్కి ఉద్దేశం. అన్ని సృజనల మాదిరీగానే సాహిత్యం కూడా మనిషి కఠోర పరిశ్రమకు చిహ్నంగా ఉద్భవించింది. అన్ని సృజనల్లో ఏ విధంగా దోపిడీ జరిగిందో అదేవిధంగా మహత్తరమైన ఈ సృష్టిని కూడా కొందరు దోచుకున్నారు. సాహిత్య సృజనలో కానీ, సాహిత్య పాత్రలోకానీ పాలుపంచుకునే అవకాశం లేకుండా చేశారు. దాన్ని బద్దలు కొట్టి గోర్కి సమాజంలో హీనంగా చూడపడే శ్రమజీవుల్ని

సాహిత్య పాత్రలుగా మలచాడు. వాళ్ళ జీవనానికి తన సాహిత్యంలో జీవం పోశాడు. వాళ్ళ జీవితామే తన సాహిత్యానికి జీవమైంది.

సాహిత్యంలో వాస్తవికత, సవిమర్శక వాస్తవికత, సోషలిస్టు వాస్తవికత అనేవి పరిణామక్రమాలు. వాస్తవికతలో సాహిత్యంలో కేవలం ఊహలకుమాత్రమే కాకుండా వాస్తవాల్ని చిత్రించాలనే కోరిక కనిపిస్తుంది. ఉన్నదున్నట్లు చిత్రిస్తే అదేవాస్తవం అని మురిసిపోయే దశ ఇది. దీన్లో నుంచి కొంచెం తార్కికంగా ఆలోచించి సమాజంలోని వివిధ విషయాలకు గల కారణాల్ని వెతుక్కోవడం రెండో దశలో ప్రారంభమైంది. ఈ దశలో రచయితలకు నిర్దిష్టమైన వర్గాభిప్రాయ దృక్పథం పూర్తిగా ఉండదు. సోషలిస్టు వాస్తవికతలో రచయితకు పరిపూర్ణమైన వర్గాభిప్రాయం ఉంటుంది. దోపిడీకి గురైన శ్రామిక వర్గానికి వత్తాసు పలకడమే రచయిత ఉద్దేశంగా ఉంటుంది. ఇదే ఉన్నతమైన వాస్తవికత.

సోషలిస్టు వాస్తవికతనుంచే సోషలిస్టు మానవతా వాదానికి దారి ఏర్పడింది. సోషలిస్టు మానవతా వాది అయిన రచయిత మనిషి దుష్టత్వానికి కారణాల్ని మనిషిలోకాకుండా సంఘంలో వెతుకుతాడు. ఈ విషయం మనకి గోర్కీ రచనల్లో బాగా ప్రస్ఫుటమవుతుంది. ఆయన పేదరికానికి, దోపిడీకి గురైన మానవజాతిని గురించి పడ్డ ఆవేదన, దానిపైన చేసిన తిరుగుబాటు ఆయన రచనలకు వస్తువైంది. మానవ పోరాటం ద్వారా సాధించుకున్నది మానవ జాతికంతా దక్కాలనేదే ఆయన మానవతా వాదంలోని ముఖ్యాంశం.

కళాకారుడి ముఖ్యకర్తవ్యంగా మనుషుల్లో ప్రపంచాన్ని గురించి చైతన్యాన్ని రేకెత్తించాలి, దాంతో ప్రపంచంలోని రుగ్మతల్ని తొలగించడానికి మనుషులు ప్రయత్నంచేస్తారు, ఈ ఉద్దేశంతోనే కళ సాహిత్యం కృషి చెయ్యాలని గోర్కీ ఆశయం. ఈ సాధనలో శుద్ధ కళావాదాన్నే కాకుండా చైతన్యాన్ని కలిగించే వినోదాల్ని కూడా రచనగా భావించాడు. గోర్కీ తన రచనా జీవితమంతా మహోన్నతమైన మానవ జాతి సమత్వం కొనం దారపోశాడు. గోర్కీ (18—6—1936) సాగించిన పోరాటాన్ని అందుకోవాల్సిన సమయం సాధించిన విజయాన్ని కాపాడుకోవాల్సిన కర్తవ్యం మన ముందుంది.

....❀....

# రచయిత ఎలా వుండాలి?

## మాక్సిమ్ గోర్కీ

మనస్సులోనూ, బయటనూ మనిషిని పట్టుకు పీడించే ప్రతి దానినీ, మనుష్యుని పురోగతినీ, శక్తి సామర్థ్యాల పెరుగుదలనూ ఆటంకపరిచే ప్రతి దానినీ రచయిత అసహ్యించుకొని ఎదుర్కోవాలి సోమరులంతే, ఇతరుల మీద బతికేసే వాళ్ళంటే, నీచులు, చేతులు నలిపే వాళ్ళంటేనూ, అన్ని రకాల, తరహాల దుర్మార్గులంటేనూ, పరమావహ్యం చూపాలి.

సృజనాత్మక శక్తికి మూలంగా, సర్వవస్తు నిర్మాతగా, ఈ భూమి మీద అద్భుతాలు సృష్టిస్తున్న వానిగా మానవుణ్ణి రచయిత మన్నించాలి. అనవరమైన శరీర శ్రమ పడనక్కరలేకుండా స్వశక్తితో, తన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానంతో ప్రాకృతిక భౌతికశక్తుల్ని ప్రతిఘటించి, నూతన ప్రతి సృష్టిచేసే వానిగా గౌరవించాలి.

స్త్రీని కేవలం శారీరకానందదాయినిగా కాకుండా, కష్టతరమైన జీవన వ్యాపారంలో నిజమైన సహచరురాలిగా రచయిత పరిగణించాలి. మనం చేసే ప్రతి పనికీ మనం పిల్లల ముందు బాధ్యులం అన్నట్లు వ్యవహరించాలి.

పాఠకులు జీవితంలో ఎక్కువ క్రియాశీల పాత్ర వహించేటట్లు రచయిత సర్వవిధాలా ప్రోత్సహించాలి. స్వశక్తిపట్ల వారిలో అధికంగా విశ్వాసం రేకెత్తించాలి, జీవిత మహదర్థాన్ని అర్థం చేసుకోలేకుండా, పనిచెయ్యడంలోని ఆనందానికున్న అపార ప్రాముఖ్యం తెలియకుండా ఆటంకపరుస్తున్న ప్రతి అవరోధాన్నీ - అది మానసికమైనదయినా, బాహిరమయినదయినా- అధిగమించగలమనే విశ్వాసాన్ని వారిలో కలిగించాలి.

శ్రామిక ప్రపంచానికి కావలసిన రచయిత గురించి నా అభిప్రాయంఇది.

### దుష్టత్వం మనిషికి సహజం కాదు

మనిషి సహజంగా దుష్టుడు కాదని, రచయితకు విధిగా తెలిసివుండాలి,

గుర్తించుకోవాలి. వర్గసమాజంలోని భయానక వ్యవస్థ అతనిని పాడు చేస్తూంది. ఆ సమాజం ప్రజల్ని పీడించకుండా, వారిలో అసూయ, దురాశ, ద్వేషం, సోమరితనం కలిగించకుండా వుండలేదు. సులభ లాభ సంపాదనకు ప్రయత్నించకుండా, చౌకబారు నిరర్ధక సరదాల కోసం, స్వేచ్ఛాచారానికి, తాగుబోతునాతనికి, అన్ని తరహాల పాడు పనుల కోసం తాపత్రయ పడకుండా వుండనివ్వదు.

మనిషికి పుట్టుకతోనే ఈ నీచమైన పాడు లక్షణాలు వుంటాయని, అవి అతనిలోని జంతుప్రవృత్తిలో గర్భితమై వున్నాయని చెప్పడం కొందరికి లాభమూ, అవసరమూను, ఆవిషయాన్ని యువకులు గమనించి గుర్తుంచుకోవాలి. మనుష్యుని చుట్టూ గిరి గీసేందుకు, ఉత్తమ జీవితాన్ని, పని స్వాతంత్ర్యాన్ని సృజనానందాన్ని సాధించాలనే వాంఛను నాశనం చేయాలనే భావం ఈ బోధనలో గర్భితంగా వుంది, దోపిడీ వర్గ రాజ్యానికి, సమాజానికి బానిసను చేయాలనే కోరిక దానిలో వుంది, ఈ బోధన మనిషిని వట్టి ముడిసరుకుగా భావిస్తుంది

ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించే వారంతా వట్టి తుష్టులు న్యాయమయిన క్రియాశీల శ్రమ జీవితానికి వీరు పనికి రారు, శ్రామిక ప్రజల్ని అసహ్యించుకొని, నీచపరచే విధంగా తప్ప మరో విధమయిన జీవితం వీరి వూహలకి కూడా అందదు. ఆఫ్రికాలోని నీగ్రో తెగలు, సైబీరియా లోని యాకూత్, బూర్యాత్, తుంగుస్ మొదలయిన వారు చాలా దయాపరులని మానవ శాస్త్రవేత్తలు నిరూపించేరు. ఆటవికులని మనం పిలిచే ఈ తెగలు, దుష్టబుద్ధులు జన్మ సహజమన్న వాదాన్ని వమ్ము చేస్తున్నాయి.

మీరు నిజాయితీగా బ్రతకాలనుకుంటే, విప్లవకారులు అయితీరాలి,



గోర్కీ డైరీల నుండి :

# చెడిపోయిన రచయిత

అనువాదం :

## రెంటాల గోపాలకృష్ణ

ఒకనాటి రాత్రి నేనొక చిన్న హోటల్‌కు వెళ్ళాను. చౌకరకం హోటల్ అది. నేలంతా చెమ్మగా ఉంది. పొగ వచ్చి కళ్ళనిండా కమ్ముకుంటోంది. అక్కడున్నదంతా అలగా జనం. అశుభమూ-శుభమూ ఎరగరు వాళ్ళు. ఎలా జరిగితే అలా జరుగుతుందన్నట్లు జీవితాన్ని చాలా తేలికగా తీసుకుని, ఏ చీకూ-చింతా లేకుండా సుఖంగా కాలక్షేపం చేసే మనుషులు వాళ్లు. నిద్ర మత్తులో ఉన్నట్లు. తాగి తూగుతున్నారు. వాళ్ళలో నాకొక వ్యక్తి కనుపించాడు. చిన్నవాడే, కాని పాపం, జీవితం ఛిన్నాభిన్నమై పోయింది. బ్రతుకు అతన్ని తల్లక్రిందులుగా పడేసింది. అతను నా దగ్గరికి వచ్చి కూచుని యిలా చెప్పడం మొదలు పెట్టాడు :

"టెలిగ్రాఫ్ ఆఫీసులో గుమాస్తా ఉన్నాడే—మలాషిన్, అతను నాజీవితం ధ్వంసం చేశాడు."

ఇలా అని తల వాల్చుకున్నాడు. తలమీది టోపీ చిరిగి, చిల్లులుపడి ఉంది. టేబుల్ క్రిందికి చూచాడు. రెండు చేతులతో తన కుంటికాలు పట్టుకుని ప్రక్కకు జరుపుకున్నాడు. దీర్ఘంగా నిశ్వసించి మళ్ళీ చెప్పడం మొదలు పెట్టాడు :

"అవును - టెలిగ్రాఫ్ ఆఫీసులో గుమస్తా మలాషిన్ నన్ను నాశనం చేశాడు. వాణ్ణి మా పురోహితుడు 'వరప్రసాది' అని పిలిచేవాడు. ఆడపిల్లలంతా 'మలాషా' అనేవారు. వాడు పిట్టంత మనిషి. సన్నగా, బక్కపలచగా ఉంటాడు. ఎర్రగా, తళతళలాడే చెక్కిళ్ళు, గోధుమ రంగు కళ్లు, నల్లటి కనుబొమలు, వాడి చేతులు ఆడపిల్ల చేతుల్లా మెత్తగా, మెదమెదలాడుతుంటాయి. బొమ్మలా ఉంటాడను కోండి మనిషి. ఎప్పుడూ కులాసాగా, దిలాసాగా తిరుగుతుంటాడు, అందరి

తోనూ కలుపుకోలు తనంగా ఉంటాడు. మా ఊళ్ళో జనాభా మూడువేల అయిదు వందలమంది. ఇంతమందిలోనూ వాణ్ణి ఎరగనివాళ్ళు లేరు. అన్ని ఇళ్ళూ చక్కపెట్టి వస్తుంటాడు. అందరి విష యాలూ ఆరా తీస్తుంటాడు. వాడంటే అందరికీ ఇష్టమే.

"నా ఇరవయ్యో ఏటనే, ఎందుచేతనో జీవితం అంటే నాకు విసుగుపుట్టింది. బ్రతుకొక భారంగా తోచింది. వికల శకలాలై, అల్లకల్లోలంగా ఉన్న విశాల విశ్వాన్ని చూచి భయవిచలితుడ నయ్యాను. ఇలా ఎందుకయ్యానో నా కర్థం కాలేదు మానవజీవితాల వెనకాల పొంచి పొంచి చూస్తున్న రహస్యం ఏమిటో నాకు అంతుపట్టలేదు. నా చుట్టూవున్న ప్రతి చలనం కూడా ఒక విషవలయంలా, భయంభయంగా కను పింపసాగింది. ఇలా వుండగా ఒక మాటు నాలో ఒక తుఫాను చెలరేగింది. నా అంతరాంతరాలలో ఏదో ఆవేశం పాతాళ గంగలా పెల్లుబికి వచ్చింది. అప్పుడు ఒక కథ వ్రాశాను. దానికి 'మానవ మనుగడ' అని పేరుపెట్టాను. దాన్ని ప్రచురణార్థం 'నీవా' పత్రికకు పంపాను. వారం గడిచింది. నెల అయి పోయింది. రెండు నెలలు దాటింది. ఆ పత్రికా సంపాదకుడి దగ్గర నుంచి నాకెమీ సమాధానం రాలేదు. నేను ఆశ వదులుకున్నాను. 'అతనికి గ్రహణశక్తి ఎక్కువానూ, గ్రహించింది నిలిచేది తక్కువానూ' అనుకున్నాను నాలో నేను.

"ఇలా మూడు మాసాలు గడిచాక ఒకనాడు నాకు మలాషిన్ కనుపించాడు. 'నీకో ఉత్తరం వచ్చింది' అంటూ ఒక కార్డు నాచేతి కిచ్చాడు. అందులో యిలా వ్రాసి ఉంది : మీ కథ చదువరుల మనస్సుల్లో ఎలాంటి ఆసక్తినీ రేకి త్తించేటట్లు కనిపించలేదు అంచాత ఇది ప్రచురణయోగ్యం కాదని భావిస్తు న్నాం. అయినా రచన చెయ్యడంలో మీకు కొంత ప్రజ్ఞ ఉంది. దయచేసి మరొకటి పంపండి.

"ఈ కాస్తదానికే నేనెంత పొంగి పోయానో, మీరు ఊహించుకోవచ్చు. ఈ ఉత్తరం మూడు రోజులబట్టి తన జేబులో ఉందని మలాషిన్ చెప్పాడు. 'ఈ ఉత్తరం నీకు అందజేద్దామని అతని దగ్గరనుంచి తీసుకున్నాను, కాని నాని దుంపతెగ మరచి పోయానయ్యా! నీవు రచనలు చేస్తున్నావని తెలుసు కున్నాలే. నీవు మరో టాల్‌స్టాయ్‌వి కావాలని ఉంది నాకు !' అన్నాడతను పరాచకంగా.

"ఇరుపురం సవ్వుకుని ఎవరిదోవన వాళ్ళం వెళ్ళిపోయాం. కాని ఆ సాయం కాలం నేను ఇంటికి వెడుతుండగా త్రోవలో మతగురువు ఒకాయన నన్ను కేకవేశాడు. తన ఇంట్లో కిటికీ దగ్గర కూచుని.

"ఏమయ్యోయ్, కవీ! ఏం ఇవ్వ మంటావు నీకు" అంటూ పిడికిలి చూపించాడు. ఆ సంతోషంలో నేను ఆయన ధోరణి అర్థం చేసుకోలేదు ఏదో సరదాగా అంటునా దనుకున్నాను, అస లాయన గమ్మత్తు మనిషి నాకు తెలుసు వయసులో ఉన్నప్పుడు ఆయన సంగీత నాటకాలలో వేషాలు వేసేవాడు. పాడే వాడు, కాని రంగస్థలం మీద బృంద గానం చేసేటప్పుడు ఎప్పుడూ మూడో వరుస వెనకాల ఉండేవాడు కాని, ప్రేక్ష కుల ముందుకు వచ్చేవాడుకాదు, ఆయన తాగేవాడు కూడా. ఆ మత్తులో ఆయనకు వళ్లు తెలిసేది కాదు, అక్రోటుకాయలు ముఖానికేసి కొట్టుకొని, బద్దలు చేస్తా నని పందెం వేసేవాడు. ఒకమాటు ఏం జరిగిందనుకున్నారు? పౌను కాయలు ముఖానికేసి కొట్టుకున్నాడు. పాపం, ముఖం మీది చర్మమంతా చిట్లిపోయింది నెత్తురు చెమ్మవచ్చింది. చాలా తమాషా అయిన మనిషిలెండి. ఆయన జేబులో యెప్పుడూ ఒక సీనారేకు డబ్బా ఉంటుంది. వేసవికాలంలో అయితే కప్పలూ, శీతాకాలంలో అయితే చుంచె లుకలూ పట్టి అందులో వేసుకుంటాడు. సమయం చిక్కినప్పుడు వాటిని ఆడ వాళ్ళ మెడలమీద మెల్లగా వదిలిపెడ తాడు. ఇలాంటి తమాషాలు ఎన్నోచేసి నవ్విస్తుంటాడు. అయినా యెవరూ ఆయన్ను కోపగించుకోరు. వస్తుతః సరదా మనిషి అవడం వల్లా, ఎంతో చదువుకున్నవాడు, పండితుడు అవడం వల్లా అంతా ఆయన్ను గౌరవించేవారు. చేపలు పట్టడంలో కూడా ఆయన గొప్ప నేర్పరి, అంతంత మాత్రపు బెస్తవా ళ్ళైవారూ ఆయన ముందు పనికిరారు. అయితే ఎన్నడూ చేపలు తినడు. ఏ ఎముకో వచ్చి గొంతున పడుతుందని ఆయన భయం.

"అంచాత ఆయనమాట పట్టించుకో కుండా కులాసాగా ఇంటికి వెళ్ళాను. నేను బయటికి చూడటానికి వికారంగా కనుపించేవాణ్ణి కాని, ఆ రోజుల్లో నా మనస్సు పరిపక్వంగానూ, సుసంపన్నం గానూ వుండేది...."

ఇలా చెప్పి అతను తన పంచటి మీసం సవరించుకున్నాడు అరమూసిన కనులతో, 'వోడ్కా' గ్లాసులో పోసు

కున్నాడు. అతని చేతులు వణకడం మొదలు పెట్టాయి. నిజానికి అతనుతన ఇరవయ్యో ఏట వన్నగా, వికారంగా ఉండేఉంటాడు. ఇప్పుడు నెరిసిపోయి చింపిరి చింపిరిగా వున్న అతని తల వెంట్రుకలు అప్పుడు రాగి వర్ణంగాను, కళ్ళు నీలి వర్ణంగాను. ముఖమంతా మచ్చలతోనూ ఉండిఉండవచ్చు. ఇప్పు డతని చెంపలు జారిపోయి పైన ఎర్రగా నరాలు కనిపిస్తున్నాయి. 'వోడ్కా' తాగాడే కాని అతనికేమీ ఉత్సాహం కలిగించలేదు ఎంతో ప్రయత్నం మీద ఏదో కలలో మాట్లాడినట్లు మళ్ళీ మాట్లాడసాగాడు.

"ఎలో ఒక ప్రత్యేకత, ఒకసొగసు ఉందనుకున్నా నేను. నిజానికి అప్పు డున్నది కూడా : నా ఆత్మ కోయిలలా గానం చేసింది. తీవ్రంగా రచనలు చేయడం మొదలుపెట్టాను ఒక పెద్ద జ్వరంలో, ఉన్నట్లుండి రాత్రిళ్లు రాత్రిళ్లు రచనలు సాగించాను. శబ్దాలు దూసుకుని వచ్చేవి నా కలం ఒక నదీప్రవాహంలా సాగిపోయేది. ఓ ఎంత ఆనందంగా ఉండేది? ఏమైనా ఊళ్లో జనమంతా నన్ను ఒక విధంగాను ఏదో విచిత్రం గాను కనిపెట్టిచూస్తున్నట్లు గమనించాను నేను. నేను ఎక్కడ అగుపించినా సరే; అదోలా చూచేవారు. 'ఓ! ఇదంతా ఓర్వలేకలే!' అనుకునేవాణ్ణి నాలో నేను.

"ఇలావుండగా ఒకనాడు మలాషిన్ ఒక ఎక్సైజ్ ఆఫీసరు ఇంటికి నన్ను టీకి రమ్మని పిలుచుకుని వెళ్ళాడు. ఆ ఆఫీసరుకు ఒక్కతే కూతురు. అందం గాను, ఒలాకిగాను ఉంటుంది ఆ పిల్ల. సరే. అక్కడికి వెళ్ళాను. ఊళ్లో పెద్దలసందర్భి అక్కడ టీకి ఆహ్వానిం చారు. వారంతా నన్ను ఎరిగినవాళ్ళే. నేను లోపల అడుగు పెట్టానో లేదో, అంతా నన్ను చుట్టుముట్టారు. 'మీరు కవులు-అప్పవా' అని నన్ను విచిత్రంగా అడిగారు. "టీలో కొంచెం చెక్కర కలుపమంటారా?" అని ప్రశ్నించారు.

"ఓ! నన్నిప్పుడు వాళ్ళంతా చక్కెర కావాలా అని అడుగుతున్నారు అనుకున్నాను నాలో నేను. చెంచాతో వారి చెక్కర అందివ్వగా నేను కప్పులో కలుపుకున్నాను. కాని టీ కొంచెం చప్ప రించేసరికి నాకు ఆశ్చర్యం వేసింది. ఏమిటి కథ? ఉప్పుగాఉంది. అబ్బ! ఉప్పు – కషాయం! అయినా. మారు మాట్లాడలేదు. టీ అంతా తాగేశాను. ఏమైనా అందామా అంటే. ఎక్కడలేని సిగ్గు ముంచుకొచ్చింది! అప్పుడు అక స్మాత్తుగా వారంతా పగలబడి నవ్వ సాగారు. మలాషిన్ నా ముఖంలో

ముఖం పెట్టి ఇలా అన్నాడు : 'ఏమిటి కథ? కవులు మంచీ-చెడ్డలు గమనించ లేరు కాబోలు! నీవు ఎంత కవివి అయితే మాత్రం ఆపాటి గ్రహింపు లేదటయా! చెక్కరకూ ఉప్పుకూ తేడా కనుక్కో లేవా? అహహ!'

"దీంతో నేను కలవరపడి పోయాను, తల కొట్టేసినట్లయింది. ఆత్మాభిమానం దెబ్బతిన్నది. 'ఏమిటో తమాషా పట్టిస్తు న్నారులే!' అన్నాను నేను.

"వాళ్లు బిగ్గరగా, విరగబడి నవ్వ సాగారు. తరువాత అందరూ కలిసి నన్ను పద్యాలు చదవమని బలవంత పెట్టారు. నేను కవిత్వం వ్రాయడానికి కొంత ప్రయత్నించినమాట నిజమే - ఆ విషయం సులాషిన్‌కు తెలుసు. కవులు యెప్పుడూ తమ కావ్యాలను పదిమంది లో చదివి వినిపిస్తుంటారు. కనుక నీవూ అలా చెయ్యాల్సిందే!" అంటూ పట్టు పట్టారు. అంతలో ఒక మేనేజరు కొడుకు దీనికి అభ్యంతరం చెప్పాడు. "సైన్యంలో పనిచేసేవాళ్ళే మంచి కవిత్వం వ్రాయగలరు. ఇతనేం వ్రాస్తాడు వికృచ్చిగా.

దానిమీదట ఆడవారికి అతనికి ఈ విషయంలో తర్జనభర్జనలు జరిగాయి. ఇల్లెగిరిపోయేటట్లు, బిగ్గరగా వాదించు కోవడం మొదలుపెట్టారు. ఇహ నేను మెల్లగా అక్కడనుంచి తప్పించుకుని బయటపడ్డాను,

"ఆ రోజు లగాయతూ ఊళ్లో అందరూ కూడా నన్నొక విచిత్ర జంతు వును చూచినట్లు చూడసాగారు. ఆ తరువాత ఆదివారంనాడు నాకు మత గురువు కనుపించాడు. చేపలను పట్టే ఇనుప కడ్డీలు మోసుకొని పోతూ నన్ను నిలవేసి ఇలా అన్నాడు :

"ఆగవోయ్, ఆగు? ఆయితే నీవు రచయితవన్నమాట! మూర్ఖుడా! నీకు తోడు రచనలుకూడానా! నేను మత గురువును—అవిరామంగా మూడు సంవ త్సరాలు సంగీత నాటకాల్లో తర్ఫీదు పొందాను. నీకూ నాకూ పొత్తు ఏమి టోయ్? అసలు నీ వెంత? నీ బ్రతు కెంత! నా దృష్టిలో నీవు ఒక చిన్న ఈగవు, దోమవు, నీవంటివాళ్ళకే నట్రా సాహిత్యం అబ్బేడీ? రచనల పేరుతో కావ్యామృతాన్ని కలుషితం చేస్తావుట్రా పుండాకోర్? ఫో!" ఇలా ఆయన నన్ను నోట ఉచ్చరించరాని తిట్లన్నీ తిట్టాడు. నా హృదయం ఎంత గానో నొచ్చుకుంది. ఎందుకు నన్నిలా తిట్టడం అని నాకు ఆశ్చర్యం కలిగింది.

"ఇది జరిగిన కొద్ది రోజులకు, ఒక

నాడు మా అత్తయ్య నన్ను పిలిచింది. నా కెవరూ దిక్కులేనందువల్ల మా అత్తయ్యగారింట్లోనే ఉంటున్నాను. ఆమె నా దగ్గరికి వచ్చి ఇలా అన్నది:

"ఏమిట్రా? ఏమిటిదంతా? వాళ్ళంతా నీమాటే చెప్పుకుంటున్నారు- నీవేదో రాస్తావుటగా! నాయనా! నా మాట విని ఆ రాతలన్నీ ఇహ కట్టి పెట్టరా. అయినా నీ కెందుకురా ఆ పాడురాతలూ? నీకు పెళ్ళీడు వచ్చిందిరా తండ్రీ. ఏదో ఒక ఇంటివాడివై, ఉద్యోగం – సద్యోగం చూసుకోరా తండ్రీ" ఆమె ఇలా కళ్ళనీళ్ళపర్యంతంగా అంటూఉంటే, నే నామెకు అంతా అర్థమయ్యేటట్లు వివరించి చెప్పడానికి ప్రయత్నించాను. రచనలు చేయడం వల్ల తప్పులేదనీ. గొప్పగొప్ప రాకుమారులు. కౌంట్లుకూడా రచనలు చేసేవారనీ చెప్పాను. అన్నిటికంటె రచయిత కావడం చాలా గొప్ప విషయమనీ, రచయితగా జీవించడం గౌరవప్రదమనీ ఎంతో చెప్పాను. కాని ఆమెగారు నా మాటలు వినిపించుకో లేదు పైగా ఏడ్వడం మొదలు పెట్టింది. "అయ్యో! భగవంతుడా! నీ కేదో దయ్యం పట్టిందిరా! ఏదో పెద్దమ్మ ఆవహించి బుద్ధి మసిపించిందిరా! లేకపోతే ఇలా ఎందుకు విశావురా నాయనా!" అంటూ వలవల ఏడ్చింది.

"ఆ మరునటి రోజు నేను బజారున వెడుతోంటే మలాషిన్ నను కేక వేశాడు: "గుడ్ మార్నింగ్ కౌంట్ టాల్‌స్టాయ్ జూనియర్!" అని వెటకారం చేశాడు వాడు నామీద ఒక పిచ్చి పద్యం కట్టాడు, ఊళ్లో కుర్రకుంకలందరికీ ఆ కొంటె పద్యం నేర్పాడు. ఇహనేం? నేను ఎక్కడ కనుపించినా సరే వాళ్ళు ఆ పద్యం ఇది:

"కవితల్ చెప్పిన లాభంలేదూ
కాసులు కలిగినవాడే ఘనుడూ!
కవులకు పైసా రానేరాదూ
కవులకు బ్రతు కెల్లప్పుడూ చేదూ
కవులకు కాకులకు భేదం లేదూ!"

"ఇలాంటి విషయాలన్నీ నన్ను తీవ్రంగా కలవర పెట్టాయి." ఈ రచనలు సాగించడంతో నా పని రభస పట్టింది. బ్రతుకంతాతారుమారయింది!" అను కున్నాను నాలో. బయటికి ముఖం చూపాలంటేభయం. ఎక్కడ ఎవడు కనిపిస్తాడో! ఏం అల్లరిపెడతాడో అవును. అందరూ నన్నుఅంతగా వేధించి.బాధించారు. ముఖ్యంగా ఆ మతగురువు-నేను కంటబడితేచాలు- పిచ్చికుక్కలా కరవవస్తున్నాడు! నన్ను చూచి ఉగ్రుడై పోతున్నాడు. "వెధవ! నీవూ కవిత్వం

రాస్తావు ట్రా ఇంత చదువు చదివిన మేమే తల్లక్రిందులై చస్తుంటే!" అంటూ నామీద ఎగబడు తున్నాడు. మళ్ళీ మాట్లాడితే కొట్టేటట్లున్నాడు!

"అప్పుడప్పుడు రాత్రిళ్ళు నేను నదీతీరానికి వెడుతుండేవాణ్ణి. అక్కడ ఒంటిగా కూచుని "వీళ్ళంతా నన్నెందు కిలా బాధిస్తున్నారు, ఏమిటి దీనికి మూలం?" అని గంటలతరబడి ఆలో చించుకునేవాణ్ణి. నది మధ్యలో ఒక చిన్న దీవి వుంది. ఆ దీవిలో గుంపుగా చెట్లున్నాయి. నేనక్కడికి ఈదుకుంటూ వెళ్ళి ఆ చెట్ల మధ్య కూచునే వాణ్ణి. రాత్రివేళ నల్లగా, తళతళ మెరుస్తూ, జలజల ప్రవహించే నదీ జలాలను పరి శీలిస్తూ కూచునేవాణ్ణి. నా ఆత్మ ఏదో అగాధంలో, అంధకారంలో మునిగి పోయినట్లు తోచేది.

"గుడ్డలుకుట్టే ఒక అమ్మాయితో నాకు పరిచయం ఉంది. మా ఇరువురి మనస్సులూ కలిసాయి. పెళ్ళాడమని ఆమెను ప్రార్థించాను. కాని తుదకు ఆవిడకూడా నావల్ల విరాదరణ చూపింది, తగువు పెట్టుకుంది. నామీద నమ్మకం లేనట్లు మాట్లాడింది: 'ఏమిటే! నీవు మమ్మల్ని గురించి పత్రికలో ఏదో రాశావుటగా?' అని అడిగింది. 'ఎవరు చెప్పారు నీకు?' అని నేను అడిగాను. అందుకామె మొదట సమాధానం చెప్ప డానికి నిరాకరించింది. చివరకు "మలా షిన్ దగ్గర నీవు రాసిన వ్రాత ప్రతి ఉంది. దాన్ని అతను అందరికీ చదివి వినిపిస్తున్నాడు, అంతా నిన్ను హేళన చేస్తున్నారు-నీవు కౌంట్ టాల్‌స్టాయ్‌ని మించి పోయావుట! అయినా నీవు దాన్ని మలాషిన్‌కు ఎందుకిచ్చావు?" అని అడిగింది.

"ఇది వినేసరికి నాకాళ్ళ క్రింద భూమి పగుళ్ళు వాసినట్లనిపించింది. ఈ కథలో మలాషిన్‌కే కాక, మత గురువుకూ, ఎక్సైజ్ ఆఫీసరుకూ కూడా భాగం ఉందనుకున్నాను. నిజానికి నా రచనలేవీ నేను మలాషిన్‌కు ఇవ్వలేదు. నా దరి నాకు వచ్చే ఉత్తరాల్లోనుంచి దొంగిలించాడు! సందేహం లేదు. తరు వాత ఆ అమ్మాయి మళ్ళీ నాతో ఇలా అంది: 'నేను నీతో స్నేహం చేస్తు న్నందుకూ, కలిసి తిరుగుతున్నందుకూ నా స్నేహితులంతా ఎగతాళి చేస్తున్నారు, ఇహ నేనేం చేయాలో తోచడం లేదు. 'అంతా అల్లకల్లోలం కానీ!' అను కున్నాను నాలో నేను. వెంటనే మలా షిన్ దగ్గరికి వెళ్లాను. నా రచన వ్రాత ప్రతి తిరిగి నా కిచ్చెయ్యమని అర్థి తంగా అడిగాను. "అది నీకెందుకోయ్!

పత్రికలవాళ్ళు తిప్పి పంపారుగా, ఇహ దాంతో నీవేం చేస్తావు?" అన్నాడు వాడు. ఏమైతేనేం వాడిదగ్గర మంచి అది నేను తిరిగి తీసుకోలేక పోయాను. అవును, వాడంటే నాకిష్టం. ఎందుచేతో! నిజానికి ఒక విషయం గమనించాను. పనికిరాని ఈ రచనలు పనికొచ్చే వాటి కంటే నాకెంత ప్రాణప్రదంగా కను పిస్తున్నాయో. అలాగే తక్కిన మంచి వాళ్ళకంటె ఇలాంటి దురుద్దేశం కల మనుషులే నయం అని తోచింది. అవును. మనుష్యులు పందాలతో కాదు బ్రతికేది కాయకష్టంతో. అయినా కుంటి గుర్రం కంటె పందెపుగుర్రమే ఎవరి కైనా నచ్చుతుంది.

"తరువాత త్వరలోనే క్రిస్టమస్ సెల వులు వచ్చాయి. విచిత్ర ప్రదర్శనాలు నృత్యాలు, పందెపు వేషాలు ప్రారం భమైనాయి. మలాషిన్ నన్ను ఆహ్వా నించాడు. నేను బ్రహ్మాండంగా కళ్ళు- చెదిరి పోయేటట్లు వేషం వేసుకున్నాను. వాళ్ళు నా తలకు బొచ్చుటోపీ ఒకటి పెట్టారు. దానికి గొర్రెకొమ్ములున్నారు. ముఖానికి - మాయ ముఖం ఒకటి తగి లించారు. ఇలా నేను వేషం వేసుకుని అందరితో కలిసి పిచ్చిగా నాట్యం చేశాను. ఒకరి నొకరం భలే భలే గమ్మ త్తులు చేసుకున్నాం. నవ్వుకున్నాం; కాని ఆఖరుకు నా వళ్ళంతా ముచ్చమటలు పోశాయి, నా ముఖం ఎందుచేతగానో భగ భగమని మంట పుట్టడం మొదలు పెట్టింది, ఇహ ఇంటికి వెళ్ళాలను కున్నాను. కాని త్రోవలో ముగ్గురు హావ్యగాళ్ళు నన్ను పట్టుకున్నారు; తలా ఒక తన్నుతన్నండిరా వెధవను!" అని కేకలు పెట్టారు. నేను తప్పించు కుని పరుగుతీయసాగాను, కాని వాళ్లు నా వెంటపడి మళ్ళీ నన్ను పట్టుకున్నారు తలా ఒక బాదుబాదారు. నా వేషమంతా ఊడదీసి పారేశారు. సరే, చివరకు ఎలాగో తప్పించుకుని ఇల్లు చేరాను. పోవడం పోవడం మంచంమీద పడి చచ్చే నిద్రపోయాను, కాని ప్రొద్దున్నే లేచి అద్దంలో చూచుకొందునుగదా, నా ముఖం బూరెలా-ఇంత లావున పొంగివుంది? ముఖమంతా ఎర్రగా వాచిపోయింది, ముక్కు దూలంలా అయింది- కళ్ళు ఇంతింత లావున వాచి నీళ్ళుకారుతున్నాయి. చూడలేక పోయాను. ఏమిటిదంతా: నన్ను ఒక రాక్షసినిచేసి వదిలిపెట్టారేవాళ్ళు! అను కున్నాను, అవును, వాళ్ళు నా ముఖానికి వేసిన మాయతొడుగులో-లోపల ఏదో ద్రావకం పూశారు! అది నా చర్మం అంతా కొరికివేసింది; చివరకు డాక్టరు

దగ్గరికి వెళ్ళవలసివచ్చింది. అదంతా మానేసరికి అయిదు వారాలు పట్టింది. కాని నా కళ్ళు బాగుపడలేదు. నాచూపు దెబ్బతిన్నది.

"తరువాత నేను ఇహ అపూర్వోక్షణం వుండకూడదనుకుని నిశ్చయించుకున్నాను. ఎవరికంట పడకుండా ఊళ్లోనుంచి వెళ్ళిపోయాను. ఇది జరిగి పదమూడేండ్లు. ఈ పదమూడేండ్లబట్టీ దేశాలు తిరుగుతున్నాను."

ఇలా చెప్పి అతను బద్ధకంగా ఆవులించాడు. అతని కళ్లు మూతలుపడ్డాయి. ఇప్పుడు యాభై ఏండ్లు పైనబడ్డ మనిషిలా కనుపించాడు.

"అయితే ఇప్పుడేం చేస్తున్నావు?" అని అడిగాను నేను.

"జాకీ" గా (పందెపు గుర్రాలను పరుగెత్తించేవాడు) ఉంటున్నాను. పందెపుగుర్రాలు తర్ఫీదుచేసే ఒకచోట నాకు ఉద్యోగం దొరికింది."

ఇలాచెప్పి అతనుచిరునవ్వు నవ్వాడు. ఆనవ్వులో నానార్థాలు ఇమిడి ఉన్నాయి.

"గుర్రాలు ఎంత మంచిజంతువులనుకున్నారు! వాటితో సాటి ఏవీరావు! కాని నా ఖర్మ! కొంతకాలం క్రితం ఒక గుర్రం నన్ను పడేసింది. నా కాలు కుంటికాలయింది!"

ఇలా చెప్పి అతను దీర్ఘంగా నిశ్వసించాడు. తరువాత ఏదో కావ్యంగానం చేస్తున్నట్లు -

"మనిషి కంటె మృగం నయం
మనిషంటే భయం, భయం!!"

అన్నాడు.

❀

---

....బతికుండే దేవుడికి మనిషే గుడి .... భూమీ్మద మనిషి కన్నా మేలైంది లేదని నేను పూర్తిగా ఒప్పుకుంటాను. బతికున్నది మనిషి మాత్రమే! మిగిలినదంతా ఊహ మాత్రమే! నేను ఇంతకు ముందు మనిషినే పూజించాను, ఇంకెప్పుడూ మనిషినే పూజిస్తాను, నాకు దీన్ని ఇంకా బాగా బలంగా చెప్పడానికి తెలీదం లేదు...."

-గోర్కీ-

యువ రచయితలకు గోర్కీ సలహా :

# "బాగా, బాగా చదవాలి"

విహ్రాస్కెచ్‌లలో "భాష చాలా ఘాటుగా సహజంగా, వాక్చిత్రాలతో నిండి వుంటుంది" అంటూ కామ్రేడ్ యార్ట్సేవ్ వ్రాసేరు. అదేమిటో చూద్దాం.

మొట్టమొదటగా - సంభాషణలలోని భాషని పక్కకు పెట్టేద్దాం. ఏమా-వాటిలో కనిపించే ఘాటు, సహజత్వం మీవి కావు. వాటిలో మీరుపయోగించినది అథోలోకపు యాస మాటలూ, చేసే సూచన ఏమిటి ? దానిపై ఆకారం కాదు చూడవలసినది, లోపలి ఏర్పాట్లు చూడండి అని. అర్థమయిందా ? తరువాత వాక్యాలను దానిలోని మొదటిపదం చివరి అక్షరం రెండో పదం మొదటి అక్షరం కలుస్తే ఏ బూతు అర్థమో వచ్చే మరో పదం ఏర్పడే విధానంలో వ్రాయకండి. ఒకరినొకరు బోల్తా కొట్టించుకొనేందుకు బడి పిల్లలు అల్లాంటి పనులు చేస్తుంటారు.

## వె. పొలెవాయ్ రాసిన లేఖ నుంచి

సంకేతాలూ, పరిభాషలూనూ. ఇంక మీ భాషలో కనిపించే వర్ణనలలో, "ఆలాడ్జి ఇల్లు రాతి పుర్రెలా వుంది." అని వ్రాసేరు. దానిలో విస్పష్టత లేదు. పుర్రె అనేసరికి ఇంచుమించు గుండ్రంగా వున్న వస్తువు జ్ఞాపకంవస్తుంది. మీరు "లాడ్జి ఇల్లు పుర్రెలా వుంది" అన్నప్పుడు మీ ఆలోచనలలో ఆఇంట్లో మాళిగ గదులో, అటకల గదులో మెదులుతున్నాయి. అంతే పాఠకుడికి మీరు

"దీపం బల్బులు పచ్చగా కుక్కకళ్ళలా వున్నాయే" ఇదే పద చిత్రాన్ని 13వ, 16వ పేజీలు రెంటిలోనూ కూడా వాడేరు. "పచ్చపి గాలిని అవి మసకగా వడకడుతున్నాయి" అనేది ఒక ప్రయోగం. మనం వడకట్టడం ఒక వస్తువు గుండా చేస్తాం ఆ వడకట్టడం నెమ్మదిగా జరగొచ్చు. వేగంగా జరగొచ్చు. కాని, మసకగా వడకట్టడం వుండదు. ఇక్కడ మీ వుద్దేశం ఏమిటో ఎవరికీ బోధ

పడదు. అదీగాక, దీపం బల్బులు ఎల్లా పటకటతాయి ? వాటి గుండా గాలి ప్రవ కిస్తుందా ? తరువాత దీపం బల్బులు పచ్చగా వున్నాయని వ్రాస్తే ఆ వెలు తురు పచ్చగా ఉందని అర్థమే కద.ఒకే భావాన్ని అంత దగ్గరలో మళ్ళీమళ్ళీ చెప్పగూడదు, విసుగేస్తుంది,

మీరు తరుచు మాటల్ని వికృతం చేస్తున్నారు. "పుర్లు" కాదు పులులు, మాంద్రు కాదు, గాంద్రు. గాంద్రించు అనేది క్రియను తెలుపుతుంది."చెవులకు పదును పెట్టడం"— అదేమిటి ? అవే మన్నా పెన్సిల్లా ? బహుశా అదేమాదిరి వినిపించే ఉక్రేనియన్ పదాన్ని వుప యోగించలేదు కద. ఆమాటకు అర్థం తెరుచుకొనడం లెండి, ఉపయోగించ డం చేసి వుండవలసింది" అని వ్రాసేరు. "ఉపయోగించి వుండ వలసింది" అని వ్రాయాలి. "ఆ మనిషి నేలను నాకేడు. గోళ్ళతో గోకి తీసు కున్నాడు. ముద్దెట్టుకున్నాడు, కావలించు కున్నాడు" అని వ్రాసేరు. అతడు అవన్నీ చేసే వుండొచ్చు. కాని మీరు వర్ణించిన క్రమంలో చెయ్యడు. ఆ వర్ణించిన పద్ధతి చూస్తే ఆ మనిషి నిజంగా అల్లా చేశాడనిపించదు.

ఇదంతా కోడిగుడ్డుకి వెంట్రుకలు తీయడం అనుకోకండి. ఇవేవో చిన్న విషయాలుకావు. శిల్పానికి సంబంధించి నవి. వడ్రంగి, కమ్మరిలాగ రచయిత కు కూడా తాను ఉపయోగంలో పెట్టే పనిముట్లు గురించి - భాష, శబ్దాలు గురించి, మంచి పరిజ్ఞానం వుండాలి. లేనప్పుడు అతడు తన భావాల్ని, అను భవాల్ని, ఇంద్రియానుభూతుల్నిచిత్రించ లేడు. వాటికి రూపం ఇవ్వలేడు. పాత్ర లను సృష్టించలేడు. మన పూర్వపు కవులలాగ యువరచయితలయిన మీరు కూడా రచనా శిల్పాన్ని స్వాధీనంలో పెట్టుకోవాలి. వారికి తెలిసినవన్నీ, వారి కన్న బాగా తెలిసి వుండాలి. నూతన జీవితాన్ని నిర్మించే బాధ్యతను చరిత్ర మీ చేతుల్లో పెట్టింది, అంటే సాహి త్యాన్ని కూడా మీరు పునరుజ్జీవింప చెయ్యాలి. ఏదో ఓ చిన్న పని చేసి వీపులు తట్టుకోనక్కర్లేదు. మహత్తర విజయాలు సాధించవలసిన బాధ్యత మీ మీద ఉంది.

మీరు అధ్యయనం చెయ్యాలి, బిద్ధ కం కూడదు. ప్రపంచంలోని మంచి వాటినన్నిటినీ, ప్రతి ఒక్క మాదిరి శిల్పాన్నీ, సర్వప్రథమంగా రచనా శిల్పాన్ని మునివేళ్ళ మీదికి తెచ్చుకో వాలి. అదో పెద్ద కష్టం కాదు, శత్రు

వర్గం మిమ్మల్ని శాశ్వతంగా తప్పుదారి పట్టిస్తారేమోనని భయపడొద్దు. సరియైన అవగాహన లేకపోతేనే అటువంటి భయం.

కామ్రేడ్ పొలెవాయ్‌లో శిల్పం రీత్యా పొరపాట్లున్నా, నిజంగా ప్రతిభ గల యువకుడు. బాగా చదవాలి. బాగా, బాగా చదవాలి,

మాక్సిమ్ గోర్కీ

30 మార్చి 1928
సోరెంటో (ఇటలీ)



" ఈ జీవితాని మీరు సృష్టించలేదు మీరు ఈ ప్రపంచాన్ని అవినీతి రాశిగా తయారు చేశారు. మీరు ఎంతసేపూ ఈ అవినీతి రాశిని మీ వినాశకరమైన మాటల్తో, పనుల్తో అభివృద్ధి చేశారు. మీకు విచక్షణలేదు, పెట్టుబడిదారులారా! మీకు సంపదే దేవుడు. మీ మీద పడబోయే ద్వేషాగ్నికి మీరు కన్నీరు కార్చక తప్పదు. మీరు రక్తదాహ పిపాసులు. మీ అభివృద్ధి, జీవనం శ్రమ జీవులపైన, ఇతరుల శక్తిపైన మాత్రమే ఉంది. మీరు నాశనమైపోతారు. మీరు ప్రతిదానికి, కనీసం కిందపడే ప్రతి కన్నీటి బొట్టు కూడా లెక్క పెట్టుకోవల్సిందే" (ఫోమా గోర్డెయేవ్ నవల నుంచి)

-గోర్కీ

# ఆరోగ్యవంతులైన రచయితలే
# ఆరోగ్యవంతమైన పార్టీకి పెట్టుబడి

రచయితలు ఓ రకంగా "రాడార్"ల లాంటి వాళ్లు. రానున్నదాని పసిగట్టగల నేర్పుంటుంది. అది లేకున్నా కనీసం రానున్న సమాజం ఏ దిశకు మళ్ళాలో స్పష్టమైన అవగాహనుంటుంది, అందుకు అవసరమైన నేపథ్యాన్ని సృష్టించడంలో రచయితల పాత్ర ఉంది సమాజాన్ని మానసికంగా అందుకు సిద్ధపరచడంలో సున్నితమైన అంశాలను సైతం కళాత్మకంగా, ప్రబోధాత్మకంగా వివరిస్తూ తమ వంతు కృషిని సాగిస్తారు. రాజకీయ మార్పులకు సాంస్కృతికంగా తోడ్పడు తుంటారు. ఇదంతా ఎప్పుడు ? – అంటే ఆ రచయితకు సామాజిక అవగాహనా, చారిత్రక పరిణామం, మానవుడికీ మానవుడికీ మధ్య ఉన్న సంబంధాలూ, మానవుడికీ తానుపయోగించే పరికరాలకూ, మధ్య ఉన్న సంబంధాల పట్ల శాస్త్రీయమైన ఆలోచన ఉన్నప్పుడు మాత్రమే ! అలాటి రచయితలను రాజకీయ పక్షాలు కూడా ఎప్పుడూ విస్మరించవు.

లెనిన్ విప్లవ కార్యాచరణలో తల మునకలయి ఉంటూ కూడా గోర్కీ పట్ల చూపిన శ్రద్ధను చూస్తే ఇదంతా తెలుస్తుంది.

లెనిన్ 1912లో గోర్కీకి రాసిన ఉత్తరంలో ప్రియమైన గోర్కీ (సాధారణంగా ఏ. యం. అంటాడు అంటే గోర్కీ అసలు పేరు అలెక్సీ మాగ్జిమోవిచ్ అని) ప్రస్తుతం మేము ఎన్నికల హడావుడిలోకంత దప్పుంగా ఉన్నాం" నీ ఆరోగ్యం ఎలా ఉంది. గడచిన తడవ నాకొచ్చిన వార్తేమిటంటే నీ ఆరోగ్యం బాగాలేదని, జ్వరం పెరుగుతోందనీనూ.... ప్రస్తుతం బాగున్నావనుకుంటా. రెండు ముక్కలు రాస్తే కృతజ్ఞుణ్ణి" అంటూ తన ఆదుర్దా ప్రకటిస్తాడు.

1919లో మరో ఉత్తరం రాస్తూ "గోర్కీ నీవు పెట్రోగ్రాడ్‌లో ఉండబట్టి చాలా కాలకాలమైంది. అవునా ! అదంత మంచిదికాదు.. ఒకేచోట ఉండడం అలసటా విసుగూ పుట్టిస్తుంది. ఓ మారు అలా దేశం చుట్టి వస్తావా ? కావల్సిన

వన్నీ సిద్ధపరుస్తాం"— అంటూ రచయితలు దేశ దిమ్మరులు కావడం అవసర మంటాడు, దానివల్ల ప్రజల సాదకబాధకాలు, సమస్యలు తెలుసుకొనే అవకాశం కలుగుతుంది రచయితలకు. మానసికంగా ఆరోగ్యవంతుడవుతాడు. రచనలు పుష్టి వంతం అవుతాయి.

లెనిన్ గోర్కీకి ఉత్తరం రాసిన వెంటనే ఓమాట అన్నాం కదాని చేతులు కడుక్కొనీ కూర్చోలేదు. ఈ ప్రయాణ సన్నాహానికి ఏర్పాట్లు చేయమనంటూ నిజ్నీ నొవ్‌గోరాద్ అనే ఆయనకో ఉత్తరం రాస్తూ "మనస్టీమర్ క్రస్నయాజ్వెజ్దా" ఎక్కడుందో వెంటనే తంతి ద్వారా తెలుసుకోండి. అది గోర్కీ కోసం 'కాజన్' రేవులో ఆగుతుందేమో కనుక్కోండి గోర్కీ కోసం ఒక కేబిన్ ఇవ్వండి. ఇది వినయ పూర్వకమైన నా ప్రార్థనగా భావించండి"- అన్నాడు. (1919) ఈ ప్రయాణాన్ని గురించి ఉల్యనోవాకు ఓ ఉత్తరంరాస్తూ "గోర్కీని ఈ రోజు కలిశాను ఈ ప్రయాణానికి ఒప్పించటానికి శతవిధాలా ప్రయత్నం చేశాను. కానీ దీన్ని గోర్కీ నిర్ద్వంద్వగా నిరాకరించాడు. ఏంచేయాలి" అంటాడు క్రుపస్కాయాకు కూడా ఇదే మాదిరి ఉత్తరం రాస్తూ లెనిన్ "నేనెంత ప్రయత్నించినా గోర్కీని ఈ ప్రయాణానికి సుముఖుణ్ణిగా చెయ్యలేక పోయా" నంటాడు (1919) చివరకు పట్టు విడవని విక్రమార్కుడిలా గోర్కీకే మరో ఉత్తరంలో (1919) నేను తరుచు గ్రామాలకెళ్తుంటాను దేశాన్నొదిలి, నిన్నెక్కడ ఏవరి దగ్గరన్నా కొన్నాళ్లు అట్టిపెడ్తా, నీకు విశ్రాంతి చాలా అవసరం తప్పకరావాలి. ఎప్పుడొస్తున్నావో తంతి ఇవ్వు నీకోసం ఒక కంపార్ట్‌మెంట్ ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తాం, సుఖంగా ప్రయాణం చెయ్యడానికి వీలుగా ఉంటుంది. నీకు నిజంగా గాలి మార్పు అవసరం నీ జవాబు కోసం ఎదురు చూస్తూన్నా నంటాడు లెనిన్.

అంతటితో ఊరుకుంటే లెనిన్ ఎలాఅవుతాడు? గోర్కీ రాసిన ఉత్తరాన్ని- బహుశా పెట్రోగ్రాడ్ వదలనంటూ రాసింది - చూసి ఉగ్రుడై గోర్కీకి ఇలా రాశాడు "పెట్రోగ్రాడ్‌లో రకరకాల యుద్ధ వంచలనాలున్నాయికదూ వీటిని భరించే నరాల పత్తువ నీకు లేదు. ఇది ఆశ్చర్యకరమైందేంకాదు. నీవు న మట నీవు

నీ మకాం మార్చాల్సిన అవసరం ఉందన్నా వినవు ఎందుకంటే నరాల మీద కొరడా దెబ్బలు పడ్తే ఎలా ఉంటుందో అలాటి దశలో ఉన్న వాళ్ళు రోగపీడితులు కాక తప్పదు ఇది తెలివిలేని తనం. ఇతర అంశాలు అలావదిలేసి కేవలం ఇంగిత జ్ఞానం ఉన్న వాళ్ళ దృష్టితో చూసినా ఇది చాలా బుద్ధిలేనిపని. అనారోగ్యమైన భావాలు అనారోగ్యమైన నిర్ణయాలకు దారి తీస్తాయి. "జాగ్రత్త" అని హెచ్చరించాడు. ఇలా సాగిన పెద్ద ఉత్తరాన్ని చివరకు "నా సలహాలు నీ నెత్తిన రుద్దకు కానీ ఓ మాట చెప్పకుండా ఉండలేను. నీవున్న పరిస్థితులు తక్షణం మార్చుకోవాలి. నీ వాతావరణం మారాలి లేకపోతే నీ జీవితం అసంతృప్తితో నిండిపోతుంది." - అన్నాడు.

మరో పర్యాయం 1921 లో గోర్కీ ఆరోగ్యం బాగా చెడిపోయింది. ఇది తెలుసుకున్న లెనిన్ మెన్‌జిన్‌స్కీకి ఓ ఉత్తరం రాశాడు అందులో గోర్కీకి తప్పక సాయం చెయ్యాలి. అదికూడా చాలా త్వరగా అతణ్ణి ఎంత ప్రయత్నించినా విదేశాలకు పంపలేక పోతున్నా. అందువల్ల అతడురక్తం కక్కుకుంటున్నాడు, కనుక నీవు నీ అధికారం చూపిస్తూ అర్జంటుగా తాఖీదులు పంపు సంబంధించిన అధికారులకు. కేవలం నీ తాఖీదులు కాగితాల పై ఉండకూడదు. ఇలా నీకు సాధ్యం కాకపోతే నా ఉత్తరాన్ని వెంటనే నాకు పంపు. నేనే నేరుగా సైనికాధికారులకు విజ్ఞప్తి చేస్తా" — నన్నాడు లెనిన్ ఆదే ఉద్రేకంతో గోర్కీకి రాసిన ఇంకో ఉత్తరంలో లెనిన్ "నేనోపని చెయ్యలేక పోతున్నా. అలసి పోయా! ఆలోచించు! నీవు రక్తం కక్కుకుంటున్నావు. అయినా విదేశాలకు పోవడానికి ఒప్పుకోవడం లేదు. నువ్వు చేస్తున్న ఈ పని విద్రోహకమైందీ - సిగ్గు లేందీనూ, ఐరోపాలో ఓ గొప్ప శానిటోరియంలో మంచిగా వైద్యం చేయించుకో. అందువల్ల ఇప్పటికన్నా ముబ్బడిగా పని చేయగలవు. సమాజానికి ఉపయోగ పడే పని చెయ్యగలవు. ఇది వాస్తవం, నిజం కూడాను. ఇక్కడుంటే నీకు వైద్యంలేదు, పని లేదు, కేవలం హడావుడి తప్ప. వెళ్ళు ఆరోగ్యం బాగు చేయించుకో. మూర్ఖంగా ఉండద్దని నా ప్రార్థన" అంటూ వినయపూర్వకంగా హెచ్చరించాడు (1921).

చివరకు గోర్కీ దగ్గర వైద్యానికి డబ్బేమీ లేదనీ తెలిసింది లెనిన్‌కు.

వెంటనే మాలటోవ్‌కు ఓ నోట్ పంపిస్తూ, దీన్నే సంబంధిత పొలిట్ బ్యూరో సభ్యులకు పంపి వాళ్ళ అంగీకారాన్ని వెంటనే పొందమని సూచిస్తాడు. లెనిన్ పంపిన ఆ నోట్ ఇలా సాగింది.

"గోర్కీ రీగాను వదిలి వెళ్ళే సమయంలో అతడి దగ్గర చిల్లిగవ్వలేదని క్రిస్టిన్ స్కీ రాశాడు. గోర్కీ పుస్తకాల రాయల్టీ రావచ్చుని ఊహిస్తున్నాడు. క్రెస్టిన్ స్కీ ఉద్దేశంలో పార్టీ ఖర్చుతో విదేశాలలో వైద్య సదుపాయాలు పొందే కామ్రేడ్ల జాబితాలో గోర్కీ పేరుండడం మంచిదని. కనుక పొలిట్ బ్యూరో ఆ మేరకు ఓతీర్మానం అంగీకరించాలనీ. క్రిస్టిన్ స్కీకు గోర్కీ పేరు పై జాబితాలో చేర్చే అధికారం కూడా దాఖలు పరుస్తున్నట్టు ఆ తీర్మానంలో ఉండాలనీ నా సూచన, అంతేకాకు అవసరమైన వైద్య సదుపాయాలకు కావల్సిన డబ్బు గోర్కీకి అందేలా చూడాలి".

లెనిన్‌కు ఎందుకో అనుమానం కలిగి ఉండచ్చు ఈ ఏర్పాట్లు ఆచరణలో ఆలస్యంకావచ్చుని. అందుకే గోరాబొనొవ్‌కు ఉత్తరంరాస్తూ (1922) "గోర్కీని గురించీ, అతడికి డబ్బు త్వరగా అందే ఏర్పాట్లగురించీ తయచేసి క్రాసిన్‌తో మాట్లాడు ఒక వేళ ఎక్కడైనా ఆటంకం ఎదురైతే తక్షణం నాతో మాట్లాడు". అంటాడు.

లెనిన్ తుదిశ్వాసవదిలేదాకా గోర్కీ ఆరోగ్యం కోసం ఎంతో పాటు పడ్డాడు గోర్కీ మహా రచయిత కనుక అలా చేసి ఉంటాడను కోవడంలో సత్యం ఉండచ్చు. గోర్కీ కూడా సోషలిస్టు సమాజం కోసం తన కలాన్నీ - గళాన్నీ అంకితం చేశాడు. గోర్కీలో అప్పుడప్పుడు కొన్ని పెడధోరణుల వాసనలు కన పడేవి లెనిన్‌కు. తక్షణం తూర్పారబట్టేడు లెనిన్. ఏమైనా మేధావులను విప్లవం లోకి రాబట్టుకోవాలనీ - వాళ్ళ మంచిచెడ్డలు కనిపెడ్తూండాలనీ లెనిన్ భావం అందుకే ఓ సందర్భంలో రచయితలా, మేధావులా సాయం తీసుకున్న విప్లవ ప్రతీఘాత ప్రభుత్వానిక్కూడా ఆయుస్సు పెరుగుతుందంటాడు లెనిన్. అయినప్పుడు విప్లవ పార్టీ బాధ్యత రచయితల బాగోగులను పరిరక్షించడంలో ఎంతటి బృహత్తర మైందో చెప్పక్కర్లేదు.

ఏ. ప్రా.

# "సారస్వతం అత్యున్నత వృత్తిగా స్వీకరించే అర్హత గలవాడు-గొప్పమహాత్ముడై ఉంటాడు"

— పడాల రామారావు

ఇట్టి స్థానాన్ని పొందడానికి గోర్కీ తనచుట్టూ ఉన్న భయంకర జీవితంలో అడుగడుక్కీ ఆపదల్నీ, ఆకల్నీ, హింసల్నీ ఎదుర్కొన్నాడు. సమాజంలోని లోభులు, ధనార్జన పరులు ఎన్నెన్ని ఘాతుకాలు చేస్తారో కడకు భార్యాబిడ్డల్నికూడా అమ్మి వేసుకొనే దుర్మార్గులకు చెందిన అనేక కథలు గోర్కీకి తెలుసు. వాళ్ళ అమ్మమ్మ చెప్పే కథల్లో అక్కడక్కడ సజ్జను లుంటారనే నమ్మకం కూడా అతనికుంది.

తెగ తిని త్రాగి తందనాలాడ్డం, తన్నుకోడం తప్ప మరోయావలేని తాత కాషిరిన్‌తో పడలేక తండ్రి మాక్సిం పెష్కావ్ భార్యాబిడ్డల్ని నిజ్నీ నుంచి సుదూర ప్రాంతమయిన ఆస్ట్రాఖాన్‌కు తీసుకుపోయాడు. అక్కడే అతడు కలరావల్ల చనిపోయాడు. అప్పటికి మన చిన్ని గోర్కీ వయస్సు నాలుగు సంవత్సరాలు. తల్లి వర్యా గోర్కీని 'అలెగ్జీ' అని ముద్దుగా పిలిచేది. గతిలేక బిడ్డడ్ని మరల నిజ్నీకి తీసుకుపోయింది. యిక్కడ గోర్కీ 12వ ఏటనే తల్లి కూడా చని పోయింది.

గోర్కీ బ్రతుకిక బండబారి పోయింది. చెప్పుల దుకాణంలో చెప్పులు తుడిచే కుర్రవాడిగా ఓడల్లో ప్లేట్లు కడిగేవానిగా గుడ్డ పేలికలు ఏరుకునే వాడిగా, ఏడవ కలాసిగా బోయవానిగా కూడా మారిపోయాడు. అమ్మమ్మ నుంచి వేరయి పోయాక అతడు పుస్తకాల బాటను పట్టాడు. గోర్కీకి పుస్తకాలు అందించిన మొదటి వ్యక్తి ఓడలో వంటవాడిగా పనిచేసే "స్మూరి" అనేవాడు. ఆ అందించిన

మొదటి పుస్తకం ఆండర్సన్ కథలు. అది గోర్కీని ఎంతగానో ముగ్ధుడ్ని చేసింది.

విద్యార్థుల నుండీ, దుకాణాదారుల నుండీ చిత్రకారుల నుంచీ అనేక పుస్తకాలు సంపాదించేవాడు. ఆ పుస్తకాల్లో ఫ్రెంచి రచయితలైన బాల్జాక్, ఫ్లాబర్టుల అమూల్య రచనలు కూడా ఉన్నాయి. ఫ్లాబర్టు రాసిన "నిరాడంబర కవిత"లో సరళ సమాసాలు, పదజాలమూ గోర్కీని ముగ్ధుడ్ని చేసాయి క్రమంగా పుష్కిన్. గొగోల్, తుర్గనీవ్, లెర్మంటెవ్‌ల కథలు చదివాడు. ఉత్తమ సారస్వతలపై సునిశితమైన భావాలు అప్పటికె గోర్కీకి ఏర్పడ్డాయి. చెహోవ్ కథలు చదివాక కథలు రాయాలనే తపన బయలు దేరింది. ఒక వార్తా పత్రికలో సాధారణ కార్మికునిగా ప్రారంభమైన ఒక శాస్త్రవేత్త జీవితాన్ని చదివి ఆశ్చర్యపోయాడు. ఇలాంటి జీవితాలు ఇంకేమైన ఉన్నాయా? అని పత్రికలు వెదికేవాడు. ఒక మిత్రుడు చెప్పాడు— ఆవిరి యంత్రాన్ని కనిపెట్టిన స్టీవెన్‌సన్ తొలుత కార్మికుడేనని.

మురికి కూపంతో నిండిన నిజ్నీని విడిచి విశ్వవిద్యాలయమున్న కజాన్ చేరుకున్నాడు. విశ్వవిద్యాలయ ప్రవేశం దొరక్క పోయినా తలదాచుకునే చోటయినా దొరకలేదు. కాని మరొక జీవితం అతనికి దొరికింది, నగర శివారాల్లో ప్రచ్ఛన్న రాజకీయ గ్రూపులూ, పోలీసులూ. విప్లవ కారులూ, త్రాగుబోతులు భికారీలు, విద్యార్థులూ రకరకాల జీవులున్నారు, యీ జీవుల్లో గోర్కీ చేరాడు. రేవులో 20 కోపెక్కుల కూలి పనీ, ఊరు చివర నిర్జన ప్రదేశంలో ఒక పాడు పడిన కొంపా దొరికాయి. ఇక్కడ నివసించే వారిలో అధికులు పల్లీలు, జేబు దొంగలు, బికీకులూనూ. ఇక్కడే విశ్వవిద్యాలయం నుండి తొలగించబడ్డ ఒక విద్యార్థీ, ఏడేండ్లు ప్రజాసేవ చేసి గుడ్డ పేలికలు ఏరుకుంటున్న ఓ రాజకీయవాదీ, గతంలో గొప్ప పశువైద్య నిపుణుడయిన ఒక బిక్షగాడూ, ఒకప్పుడు గవర్నరు వద్ద పనిచేసిన ఒక దేశ ద్రిమ్మరీ గోర్కీకి స్నేహితులయ్యారు.

కొందరు మిత్రులాయన్ని చిన్న పచారీ దుకాణం వద్దకు తీసుకెళ్ళారు.

ఆ యజమాని దిరాన్‌కోవ్, గొప్ప విప్లవకారుడు. అదిపైకి పచారి దుకాణం నేలమాళిగలో విప్లవ సాహిత్యమూనూ, కజాన్ విశ్వవిద్యాలయంలో పొందలేనంత విజ్ఞానాన్ని యీ విప్లవ విశ్వవిద్యాలయంలోనే పొందాడు. మార్క్స్ "కేపిటల్"లో ఒక ప్రకరణం దొరికింది అది చేతులుమారుతోంది. రహస్య సంఘాల్లో చర్చలు జరిగేవి. ఆ చర్చల్లో గోర్కీ పాల్గొనేవాడు యీ చర్చల్లో స్వయం కృషి ద్వారా వెలుగులోకి వచ్చే వ్యక్తుల యెడ మేధావులనుకునే వారు ఎంతటి నీచమైన వైఖరి అవలంభిస్తారో కూడా తెలుసుకున్నాడు.

అంతకు ముందు పల్లెలు నిష్కపటమైనవని అనుకున్నాడు- పల్లెటూరి రైతుల్లో విప్లవ ప్రచారం చేయాలనే దృష్టితో దిరాన్‌కోవ్ ఒక పల్లెటూరిలో బేకరీపెట్టి, గోర్కీని అందులో పని చేయడానికి ఆహ్వానించాడు. ఆ పల్లెటూర్లో ఎంత స్వలాభం, గుడ్డి ద్వేషం ఉంటుందో కుంచ కోపం ఒక బాలుని తల బ్రద్దలు గొట్టండంతో అర్ధమైంది. దరావ్‌కోవ్‌తో సన్నిహితంగా ఉన్నాడనే నెపంలో రోసెబాస్ అనే రైతును స్థానిక భూస్వాములు చంపివేసి, దిరాన్‌కో బేకరీని తగులబెట్టేరు.

అక్కడనుంచి గోర్కీ దొంగ చాటుగా పడవెక్కి ఆష్ట్రాఖాన్ చేరుకున్నాడు. అచట నుండి ఖాలాసీగా పడవలాగుతూ, పొట్ట నింపుకుంటూ దీర్ఘ కాలానికి కాస్పియన్ చేరుకున్నాడు, అక్కడ జాలరిగా కొంత కాలం బ్రతుకు మార్చి మరల కజాన్ చేరాడు.

గోర్కీకి 22 యేండ్లు వస్తున్నవి. అక్కడ నుంచి నిజ్నీ వచ్చేసాడు. కాలి నడకను సాగించిన గోర్కీ మొట్టమొదటి యీవత్తు రష్యా పర్యటన యిదే. డాన్ నదీ తీరం గుండా కజాన్ ప్రాంతాలను చూచి కోసక్కుల దేశంలో కొన్ని రోజులుండి చివరకు సెప్టెంబరులో మాస్కో చేరుకున్నాడు.

ముందుగా టాల్‌స్టాయిని చూడాలనుకొని ఇంటికి వెడితే ఆయన లేడు. ఆయన భార్య సోఫియా ఆంద్రియేన్నా మాత్రం గౌరవంగా లోనికి తీసుకువెళ్ళి ఫలహారం పెట్టి మర్యాద చేస్తూ "ఆయనను చూడవచ్చే వారిలో ఎక్కువమంది

అవమానాన్నదులైన దేశ ద్రిమ్మరులే!" అని ఎత్తి పొడిచింది.

అచట నుండి నిజ్నీ వెళ్ళడానికి ఒక గార్డు సహాయంతో గూడ్సు బండి లోని పశువుల వేగనులో ప్రయాణం చేశాడు.

నిజ్నీ చేరి అచటి విప్లవ బృందాలలో పనిచేస్తున్న కారణంగా గోర్కీని అరెస్టు చేసారు. నెల గడిచాక విడిచి పెట్టారు నిజ్నీలో యావద్దేశానికీ తెలిసిన రచయిత కొరొలెంకోవ్ ఉన్నాడు. అతడు గోర్కీ వీపుతట్టి 'నీలో గొప్ప ప్రజ్ఞ ఉందని" ఆశను రేకెత్తించాడు ఇప్పుడే గోర్కీ తొలిసారిగా 'ఓల్గా' అనే యువతిని ప్రేమించాడు' ఆమెకో భర్త ఉన్నాడు అతడ్ని విడనాడి గోర్కీతో ఉండడానికి సాహసించని కారణంగా విరక్తి చెంది నిజ్నీని విటిచిపెట్టి, రోస్టావ్ చేరి హార్బరులో కొంత కాలం పనిచేసి, మరల రోస్టాక్‌ను విడిచి ఉక్రేయిన్ గుండా రుమేనియా పరిహద్దునున్న డాన్యూబ్ నదీ తీరాన్ని పట్టి, దాదాపు రెండేండ్లు కఠోర దేశాటన సాగించాడు.

ఒకనాడు ఉక్రెయిన్ గ్రామంలో ఒక సంఘటన జరిగింది. దాన్ని "కదం" అంటారు. భర్తకు అవిశ్వాసంగా ఉంటున్న యువతిని వస్త్రవిహీనను చేసి మోటైన బండికి ఒక వైపు గుర్రాన్నీ మరోవైపు యువతినీ కట్టి, బలవంతంగా బండిని లాగించారు. దున్నపోతులా ఉన్న యువతి భర్త తటాలున బండి పైకి దూకి గుర్రాన్నీ, యువతినీ కొరడాతో కొడుతూ బండి తోలుతాడు. వెనుక కేరింతలు కొడుతూ జన సమూహాలు! గోర్కీ "కదం— ఒక అగ్ని పరీక్ష" అన్న కథలో యీ కథ నిజంగా 1891 జూలై 15న జరిగినట్టు చెప్పాడు. ఆ సమయంలో గోర్కీ ఆ కర్కశ దురాచారాన్ని నిర్భయంగా ఎదుర్కొన్న ఫలితంగా జన సమూహాలు ఆయనను చిత్రహింసలు చేసి కొన ఊపిరితో ఉండగా ఆ ఊరి పుంతిలోకి త్రోసేసారు! ఆ దారిని పోతున్న మిత్రులు సానబల్కీ, ఒక సాహెబ్ పుణ్యం కట్టుకొని హాస్పిటల్లో చేర్చారు.

అతడు తార్తార్ ప్రాంతం గుండా పోతున్నప్పుడు "మైకన్" పట్టణంలో ప్లేగురాగా జారు ప్రభుత్వాధికార్లు తీసుకొంటున్న బుద్ధి తక్కువ చర్యలకు ఆగ్ర

హించి ప్రజలు దేహశుద్ధి చేస్తేకోసక్కు సైనికులొచ్చి అనేక మందిని కాల్చి చంపారు ఆ సమయంలో ఊరికి కొత్తగా కనబడ్డ గోర్కీని అరెస్టు చేసి, సైనిక బారక్తాసుల్లో బంధించారు. ఇది గోర్కీ రెండవ చెరసాల జీవితం ;

తన యీ భయానక అనుభవాల నన్నింటినీ గోర్కీ తన స్వీయ చరిత్ర మూడు భాగాల్లో వివరించారు.

తనకు ఒక ఎరుకలవ్వ చెప్పిన "మీకాద్ భద్ర" కథను రాసి పత్రికలకు పంపాడు, యీ కథ 1892 సెప్టెంబరులో పత్రికలో పడింది. పత్రికలో పడిన గోర్కీ మొదటి కథ యిదే; యీ కథకు "మాక్సిం గోర్కి" అని పేరుయిచ్చాడు. "మాక్సిం" తండ్రి పేరు. "గోర్కి" తన పేరు. గోర్కి అనగా "కఠినుడు" అని అర్థం. యీ కథకు ప్రతి ఫలంగా 30 రూబుళ్ళ చెక్కు వచ్చింది, ఆనాడు గోర్కి పొందిన ఆనందం ఇంతింత కాదు.

అప్పటి నుండి గోర్కీ కథలు పుంఖానుపుంఖాలుగా పత్రికల్లో వస్తున్నాయి, అది చూచి కోరువెంకోవ్ గోర్కీని నిజ్నీని విడిచి "సమారా"కు రమ్మని తన "సమదస్కయా గెజటా" పత్రికలో పనిచేయమని ఆహ్వానించాడు.

యీ పత్రికలో ప్రతీ ఆదివారం గోర్కీ కథ వచ్చేది. జనం విరగబడి చదివేవారు. పట్టణ సమస్యలపై వ్యాసాలు రాసేవాడు. ఆ వ్యాసాలు "సమారా" లోని భావ పిశాచాలకు సింహస్వప్నంగా ఉండేవి. ఏడాదికల్లా గోర్కీ పేరు తారామండలానికి ఎగబాకింది నిజ్నీలో ఒక పత్రిక సంపాదక వర్గంలో చేరాడు. అప్పుడే గొప్ప పాలిశ్రామన్ ప్రదర్శన జరిగింది. దానిపై వరుసగా వ్యాసాలు రాస్తూ ఆ ప్రదర్శనలో పెట్టిన వస్తువులకు పబ్లిసిటీ యిస్తూన్నారు గాని, వాటిని తయారు చేసిన శ్రామికుల దీన స్థితిని ఎవ్వరూ పట్టించుకోడం లేదని ప్రపంచం దృష్టికి తెచ్చాడు. సోషలిస్టు వాస్తవికతను ఈవిధంగా సాహిత్యంలోకి తెచ్చిన ఘనత గోర్కీదే.

నిజ్నీలోనే తన కథలు గీతాలు రెండు సంపుటాలుగా వెలువరించాడు

ఇవి గోర్కీని ప్రఖ్యాత రచయితలైన టాల్‌స్టాయి, చెకోవ్‌ల ప్రక్కనిలిపాయి. దోపిడీ పట్ల రాజీలేని పోరాటం, మానవుని పట్ల అచంచల విశ్వాసం గోర్కీ మూల విధానం.

ప్రభుత్వానికి కన్నెర్ర కలిగి గోర్కీని నిజ్నీలో అరెస్టుచేసి టిఫ్లిస్‌లో బంధించారు. తిరిగి నిజ్నీ రాగానే గోర్కీ బికారీల కోసమని పెద్ద సత్రం కట్టించాడు, క్రిస్‌మస్ వచ్చిందంటే బాలబాలికలకు చెప్పులు, బట్టలు, టోపీ, మీఠాయిలు, బిస్కట్లూ పంచేవాడు,

1902లో శాస్త్రవైజ్ఞానిక పరిషత్తు సభ్యునిగా గోర్కీని ఎన్నుకొని రెండు సార్లు జైలు పడ్డ కారణంగా పరిషత్తు నుండి బహిష్కరించారు.

పిమ్మట 'పండితమ్మన్యులు' "అగాధాలు" నాటకాలు రాసాడు. 'అగాధాలు నాటక ప్రదర్శన రోజున గోర్కీ గౌరవార్థం బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది,

1905 జనవరి 9 విప్లవ ప్రదర్శనలో పాల్గొన్నాడు. విన్నపం చేసుకోడానికి వచ్చిన జనంపై కర్కశంగా కాల్పులు జరపడాన్ని ముందుగా పన్నిన కుట్రగా గోర్కీ ప్రకటించాడు. ఫలితం జనవరి 11న అరెస్టు చేశారు. అప్పుడు ఒక్క రష్యా దేశము మాత్రమే కాక యావత్ప్రపంచమూ స్పందించింది.

"గోర్కీ ఒక్క రష్యాకు మాత్రమే చెందినవాడు కాదు యావత్ప్రపంచానికి చెందిన వాడు," అని పారిస్ సభలో అనటోల్ ఫ్రాన్సు ప్రకటించాడు, అలాగే జర్మనీ, ఇటలీ, పోర్చుగీస్, బెల్జియం పలు దేశాల నుండి అసమ్మతి అమ్ముల వర్షం కురపగా కడకు జారు ప్రభుత్వం లొంగి విడుదల చేసింది.

మాస్కో కార్మికులు సమ్మె ఆయుధంతో వీధిని పడ్డప్పుడు; అప్పుడు గోర్కీ మాస్కోలోనే ఉండి ఆయుధాల కోసం విరాళాలు సేకరిస్తున్నాడు. అతడి ఇల్లు తుపాకులు, రివాల్వర్లు, చేతి బాంబులతో నిండిపోయింది, గోర్కీ అంగరక్షకులుగా కకేషియన్ విద్యార్థులు ఆయన ఇంటిలోనే తుపాకి దళాన్ని ఏర్పరిచాడు. గోర్కీ

బాండేడ్లు విర్మిస్తున్న కార్మికుల్ని వాళ్ళను కాలుస్తూ ముందుకురుకుతున్న పై విక గుంపుల్ని చూశాడు. మాస్కో తిరుగుబాటు అణగదొక్కబడినా ఆ విప్లవజ్వాలను చల్లార్చడం వాళ్ళతరం కాకపోయింది. కార్మిక వర్గానికి గోర్కి యిచ్చిన పిలుపుకు కరపత్రాలు వేసి రష్యా అంతటా విరజిమ్మారు.

"శ్రామిక వర్గం అజేయమైనది - తిరుగులేని విజయం సాధించగలశక్తి దానికి ఉంది, యీవర్గం నైతిక బలం గలది. ధర్మ నియతి గలది. గమ్యంలో ప్రజల విశ్వాసం కార్యాచరణలో పట్టుదల గలది. రష్యాలోకల్లా శక్తివంతమైన దిదే!" అదే ఆ పిలుపు.

1905 మాస్కో తిరుగుబాటు సమయంలో గోర్కి తొలిసారిగా లెనిన్ ను కలుసుకున్నాడు. గోర్కి పై వారంటుందని మిత్రులు హెచ్చరించగా జర్మనీకిపోయి, అక్కడనుండి ఫ్రాన్సుకు అమెరికాకు చేరాడు. న్యూయార్క్ లో ఉండే "డాలరు భూతం" మొదలయిన కథలు రాసాడు. ఇక్కడే "అడిరోండల్స్" తోటలో మారుమూలనున్న ఓ పొడగాటి గృహంలోనే గోర్కి విశ్వవిఖ్యాతమయిన "అమ్మ" నవలను రచించాడు. దీన్ని జారు ప్రభుత్వం నిషేధించింది.

"అమ్మ"లోని పావెల్, నిలోవా పాత్రలు తమబాగా ఎరిగున్న"సొర్మోవో" కార్మికుల నుండే ఎన్నుకున్నాడు.

జారు ప్రభుత్వం గోర్కిపై వారంటు జారీ చేయగా అమెరికాను విడిచి ఇటలీలోని కాప్రీ ద్వీపంలో నివాస మేర్పరచుకున్నాడు. ఆ సమయంలోనే లెనిన్ కు గోర్కి అత్యంత సన్నిహితుడయ్యాడు, 1907లో లండన్ లో జరిగిన సోషల్ డెమోక్రాటిక్ పార్టీ, 5వ కాంగ్రెస్ కు గోర్కి ఆహ్వానించబడ్డాడు. బోల్షివిక్కులకు మెన్షివిక్కులకూ మధ్య జరిగిన వాగ్యుద్ధాన్ని వింటున్నాడు,

"అకురున లెనిను చరచరా నడుస్తూ వేదికపైకి వచ్చి అతిక్లిష్టసమస్యలతో కూడిన సిద్ధాంత విధానాలపై అనర్గళంగా సరళమయిన మాటల్లో వక్కాణిస్తుంటే నేను ముగ్ధుడనయి పోయాను. లెనిన్ గొప్ప వాక్చతురుడు" అన్నాడు గోర్కి.

లెనిన్ వ్యక్తిత్వం ఎడల గోర్కి మనస్సు పైపడ్డ తొలి ముద్ర అది. నాటి నుండే గాఢ స్నేహం,

కాప్రీలో లెనిన్ గోర్కీని కలుసుకున్నాడు. ఇక్కడ లెనిన్ తన దీర్ఘకాలిక బడలికను తీర్చుకున్నాడు. ఒక్కో సాయంత్రం వాహ్యాళిలో వారిద్దరూ అద్భుత మయిన తమ అనుభవాలను మాట్లాడుకునేవారు.

లెనిన్ గోర్కీని శ్రామిక సారస్వతానికి మకుటంలేని చక్రవర్తిగా గౌర వించాడు. "ఆయన ప్రపంచ శ్రామికోద్యమ విజయానికి కృషి గావిస్తున్న అఖండ ప్రతిభాశాలి" అన్నాడు.

జారు ప్రభుత్వం 1913లో క్షమాభిక్ష ప్రకటించినప్పుడు గోర్కీని రష్యాకు రమ్మని లెనిన్ ఆహ్వానించాడు. గోర్కీ వెంటనే బయలుదేరి వచ్చి సెంట్ పీటర్స్‌బర్గ్‌లో స్థిరపడ్డాడు.

1921లో గోర్కీ ఆరోగ్యం పూర్తిగా చెడి పోయినప్పుడు చికిత్స కోసం విదేశాలకు వెళ్ళమని లెనిన్ పట్టుబట్టాడు. ఇటలీ వెళ్ళాడు. 1928లో తన షష్టి పూర్తి ఉత్సవ సందర్భంగా తన పోషలిస్టు సోవియట్ రిపబ్లిక్కుకు తిరిగి వచ్చాడు యావత్తు దేశం తమ ప్రియతమ విప్లవ రచయితకు నివాళులెత్తింది.

గోర్కీ ఎన్నో పత్రికలను నడిపాడు, సోవియట్ రచయితల సంఘానికి నాయకత్వం వహించాడు.

1932లో గోర్కీ సారస్వత వ్యాసంగం యొక్క 40వ వార్షికోత్సవం జరిగినప్పుడు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ తన అభినందన సందే శంలో ఇలా తెలిపింది.

"మాక్సిం గోర్కీ పేరు సోవియట్ భూమికి అత్యంత ప్రియమైనదీ, ఆత్మీయమైన దీనూ. సోవియట్ హద్దుల్ని దాటికూడా యీ విప్లవ రచయిత పేరు జారు ప్రభుత్వ వ్యతిరేక పోరాట యోధునిగా మార్మోగింది."

1936 జూన్ ఆయన హటాత్తుగా జబ్బు పడ్డాడు. 18 ఉదయాని కల్లా ఆయన శాశ్వతంగా కన్నుమూసాడు. సారస్వతం అత్యున్నతవృత్తిగా స్వీకరించిన అర్హతగల మహాత్ముడుగానేగాక శ్రామిక సారస్వతానికే మకుటం లేని చక్రవర్తిగా మనోన్నత సాధనానికి ఎదిగిన గోర్కీ ఇక మనకు లేడు.

గోర్కీ మరణ వార్త కార్చిచ్చులా దేశమంతా ప్రపంచ మంతా వ్యాపించింది. రెడ్‌స్క్వేర్‌లో జరిగిన స్మారక సభలో గోర్కి మరణం వల్ల శోకాంబుధిలో మునిగి యున్న లక్షలాది ప్రజల మనోభావాలను తన ప్రసంగంలో మొలటోవ్ ఇలా వెల్లడించాడు:

"అలెగ్జీ మాక్సిమోవిచ్ గోర్కిని ఎడబాసిన ఆయన మిత్రులమైన మనం, అసంఖ్యాక పాఠకలోకం నేడు మన జీవితాల్లో ఒక స్వర్ణ పుట శాశ్వతంగా చిరిగి పోయినట్లుగా చింతిస్తాం. లెనిన్ తర్వాత గోర్కి మరణం మన దేశానికి పీడిత మానవ కోటికీ తీరని నష్టాన్ని చేకూర్చిందని భావిస్తాం"

ఈ జయంతి నాడు మహాకవి గోర్కిని స్మరించుకొని. సారస్వత క్షేత్రంలో విప్లవోన్ముఖంగా ముందుకు పోవుటకు శపథం చేద్దాం.



.... ఇంకో లోకంలో (స్వర్గం) సంతోషం పొందవచ్చుననే భ్రమ మతంవల్ల నాకు ఉండేది........ అయితే గోర్కీ ప్రవేశపెట్టిన కొత్తమతం 'మానవతావాదం' మిగిలిన వాటికన్నా భిన్నమైంది, తిరుగులేంది. గోర్కీ 'అమ్మ'లోని చివరిమాటలు నాలో కొత్తభావాల్ని రేకెత్తించాయి. ఈనవల్లో, మనుషులు మానవ తేజో భవితకు, అవిశ్రాంత నమ్మకంతో వీరోచితంగా పోరాడడాన్ని చదివాను.

.... ....'.... .... .... .... .... .... .... ....

చాలామంది జీవిత రంగస్థలంలో కనిపిస్తారు. మానవతా వాదంతో, సత్యాన్ని స్థిరచిత్తతతో ప్రేమించే గోర్కీ వాళ్ళలో ఉన్నతుడుగా ఉంటాడు.

— డి. కె. బెడేకర్

# భారతీయ రచయితలం - గోర్కీ ప్రభావం

— చల్లా రాధాకృష్ణశర్మ

భారతీయ రచయితలను ప్రభావితం చేసిన ముఖ్యమయిన రష్యా రచయితల్లో మక్సీం గోర్కీ ఒకరు. గొప్ప మానవతావాది, స్వాతంత్ర్య పిపాసకుడు అయిన గోర్కీ రచనలు 30వ దశాబ్దంలో రచయితలను బాగా ఆకట్టుకొంది. అనేక భారతీయ భాషల్లో గోర్కీ రచనలకు దొరికే అనువాదాన్ని బట్టి ఇప్పటికీ ఆయన రచనలు చదివేవాళ్ళు, అభినందించేవాళ్ళున్నారనేది సత్యం.

గోర్కీ రచనల్లో 'అమ్మ' నవలకు బహుళ వ్యాప్తి ఉంది. చాలామంది తెలుగు రచయితలు ఆ నవల తమ దృక్పథంలో మార్పుతెచ్చిందని మనస్ఫూర్తిగా భావిస్తున్నారు. ఈ రచయితలు "అమ్మ"లో ఒక కొత్త ఉపదేశాన్ని చూశారు. పేదల, ముఖ్యంగా శ్రామికుల బాధల్ని, పోరాటాల్ని వాస్తవికంగా చిత్రించడం యువ రచయితలపై గోర్కీ ప్రభావం పడ్డానికి కారణమయింది. కె. లింగరాజు, టి. వెంకటరామయ్య మొదలయిన వాళ్ళపైన అమ్మ ప్రభావం బాగా ఉంది లింగరాజు అమ్మని 1932లోనే జైల్లో ఉన్నప్పుడు అనువదించారు. కానీ ఇది 1934లో ముద్రించబడింది. ఆ తర్వాత అది చాలా సార్లు ముద్రించబడింది. అదే భారతీయ భాషల్లో మొదటి అనువాదం కావచ్చు. ఈ మధ్యనే పి. రామారావు కూడా అనువాదం చేశారు.

ఈ నవల తమిళ, మలయాళ, కన్నడ, హిందీ, బెంగాలీ, గుజరాతీ మొదలయిన ముఖ్యమయిన భారతీయ భాషల్లోకి అనువాదమయిందని చెప్పడం అవసరం అనుకుంటాను.

తమిళంలో 1940లలో పి. రామస్వామి "అన్నై" పేరుతో ఈ నవల

---

ఇంగ్లీషు నుంచి అనువాదం : మనీష్

సంక్షిప్త రూపాన్ని ప్రచురించారు. తరువాత చిదంబర రఘునాథన్ "తాయ్" పేరుతో పూర్తి నవలను ప్రచురించారు. ఈ అనువాదం మంచిదిగా గుర్తింప బడింది "అమ్మ"గా మలయాళంలో కె వి. మణలిక్కర "మాన్"గా హిందీలో చంద్రబాల్ జవహరి "అమ్మ"గా గుజరాతీలో భోకిలాల్ గాంధీ. మరాటీలో ప్రభాకర్ ఊర్దవరేష్ అనువాదం చేశారు. ఇవి ముఖ్యమయినవి మాత్రమే.

దీన్నిబట్టి రాజకీయాతీతంగా ఈ నవల భారతీయ రచయితలకు అభిమాన పాత్రమయిందని చెప్పవచ్చు .

గోర్కీ చిన్న నవలల్లో "ద త్రీ" ప్రాచుర్యం పొందింది. దీన్ని తెలుగులో "ముగ్గురు మిత్రులు" గా జి. లింగరాజు అనువదించారు.

కథ, నాటక రచయితగా కూడా గోర్కీ ప్రఖ్యాతిగాంచారు. ఆయన కథలు అనేక భారతీయ భాషల్లోకి అనువాదమయ్యాయి. చదువరులకు ఆసక్తి కూడా కలిగించింది. దక్షిణ భారతీయ భాషల్లో - చిదంబర రఘునాథన్ తమిళంలో మహీధర జగన్మోహన్‌రావు, ఎన్. ఉమా మహేశ్వరరావు మొదలయిన వాళ్ళు తెలుగులో కె. ఎస్. నారాయణ పిళ్ళై, సి జె. థామస్‌లు మలయాళంలో దీని అనువాదాల్ని ప్రచురించిన వాళ్ళలో కొందరు.

ఈ సమయంలో కె.కె నాయర్ గోర్కి రచనలకి మలయాళంలో చేసిన ప్రచారం చెప్పుకోదగింది. ఆయన 1934లోనే గోర్కీ రచనల అనువాదాన్ని ప్రారంభించి ఏడు సంపుటాలు ప్రచురించారు.

గోర్కి నాటకాల్లో "ఎనిమీస్". దలోయర్‌డెప్త్స్, ఫోమాగొర్దెయెవ్" కొన్ని భారతీయ భాషల్లోకి అనువాదమయ్యాయి. శ్రీవివాస చక్రవర్తి (పతిత జీవులు) దలోయర్ డెప్త్సను తెలుగులో గిరీష్‌భావే గుజరాతిలోనూ అనువాదం చేశారు. ఆర్. గోపాలకృష్ణ. బి. రామదాస్, ఫోమాగొర్దెయెవ్‌ను తెలుగు చేశారు.

ఈ అనువాదాలతో పాటు చాలా భాషల్లో ప్రముఖ రచయితలు గోర్కి జీవిత కథను రాశారు. మలయాళంలో జోసఫ్ ముండస్సెరీ రాసిన 'మక్సిమ్‌గోర్కి', హిందీలో మన్మథరాయ్ రాసిన గోర్కి', ఇలచంద్ర జోషి రాసిన గోర్కి, కె.

సంస్మరణ్. తెలుగులో ఎమ్ జగన్ మోహనరావు రాసిన 'గోర్కీ జీవితం ఈ సమయంలో చెప్ప దగినవి.

రోస్కిన్ రాసిన "లైఫ్ ఆఫ్ గోర్కీ"కి పి రామారావు చేసిన తెలుగను వాదం కూడా చెప్పదగిందే!

ముగించే ముందు డా ఎస్ రాధాకిష్ణన్ సాహిత్యాన్ని గురించి చెప్పిన మాటల్ని చెబుతాను

"మనుషులు వాళ్ళ మనోభావాల్ని ధైర్యంగా చెప్పినప్పుడూ వాళ్ళకు కలిగిన ఆలోచనల్ని స్వతంత్రంగా వ్యక్తీకరించి నప్పుడే గొప్ప సాహిత్యం ఉద్భవి స్తుంది"

గోర్కీలో మనం ఈ భావ ప్రకటనా ధైర్యాన్ని చూడవచ్చు. గోర్కీ ఇంకా మనతో బతికే ఉన్నారు ఇంకెప్పటికీ బతికే అంటాను.

... ❋ ....

గోర్కీ వాస్తవిక చిత్రీకరణలో విషయాల్ని దాటవేయలేదు. సమాజంలోని పేదవాళ్ళు, నిరాశ్రయులు, సంచారులు, వేశ్యలు, నిరుద్యోగ కార్మికులు మొదలయిన వాళ్ళనుంచి ఆయన పాత్రలు చిత్రించబడ్డాయి. (భీష్మ సహాని) సమాజంలోని అటువంటి వర్గాలకు ఆయన అద్దం పట్టారు. "అతనికి ముందు సాహిత్యానికి వాళ్ళను తెలియదు. శ్రామికుల్ని సాహిత్యానికి స్నేహితుల్ని చేశారు. రచయితలు ప్రపంచ బూర్జువా ఉద్దేశాలకు, ఇష్టాలకు పూర్తిగా అన్ని విధాలా ఆధారంగా ఉండటం లేదంటే, దానికి మనం గోర్కీ మేధస్సుకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి"

— హెన్రిచ్ మన్

**కథానిక**

# శూరుడు

—గోర్కీ

పూర్వం ఒకానొక కాలంలో మూడువేపులా కాకులు దూరని కారడవి, నాలుగోవేపు మైదానమూగల ప్రాంతంలో ఓ తెగకు చెందినవారు నివసించేవారు. తెగలోని వారంతా దృఢకాయులు. ఆనందంగా జీవితం గడిపేవారు. అనుకోకుండా వారికి కష్టకాలం దాపురించింది. మరో తెగవారు వాళ్లపై దాడిచేసి, వారిని అడవుల్లోకి తరిమివేశారు. సూర్యకాంతి కూడా దూరనంత దట్టంగా కొమ్మలల్లుకు పోవడంతో, ఆరణ్యంలోని నీరు విషపూరిత మయింది. కొందరు జబ్బునపడి చచ్చారు. స్త్రీలు, పిల్లలు గగ్గోలుపెట్టి ఏడ్చారు, పురుషులు దుఃఖంతో నిస్పృహ చెందారు. వారికి ఆ అడవినుండి బయట పడడం కంటే మార్గాంతరం లేకపోయింది. బయట పడడానికి వారికి రెండే రెండు తోవలున్నాయి, ఒకటి వచ్చిన తోవనే వెనక్కి పోవడం. కాని అక్కడ బలమైన శత్రువులున్నారు. రెండవది. ముందుకు పోవడం, ముందు కాకులు దూరని కారడవి.

స్వేచ్ఛా జీవనానికి అలవాటు పడిన ఈ తెగ నీడల గోడలచే చుట్టబడి వాటి క్రిందపడి నలిగిపోయేలా వున్నారు. చెట్ల చివరల వీచేగాలి వారికి మృత్యుగీతం ఆలాపిస్తున్నట్లుంది. వారంతా యోధులే. చావుకు తెగబడిపోట్లాడగల శూరులే. కాని యుద్ధంలో తెగంతా తుడిచిపెట్టుక పోతుందని వారిభయం. అందుకే రాత్రీ-పగలూ తెలియని కాలాన్నీ—విషపూరితవాయువుల్ని భరిస్తూ కాలం భారంగా గడపడం, వారు మంటల చుట్టూ కూర్చుంటే వారిచుట్టూ మృత్యునీడలు విశృంఖలంగా నృత్యం చేసేవి. అడవిదయ్యాలు విజయోత్సవాలు జరుపుకుంటున్నట్లు, భయంవారి హృదయాల నావహించింది. వారి బలమైన చేతుల్ని కట్టిపడేసింది. చచ్చిపోయిన వారిపై ఏడ్చే స్త్రీల

అనువాదం: కొమ్మారెడ్డి కేశవరెడ్డి

ఏడ్పులు - బ్రతుకున్నవారికి పట్టబోయేగతి గురించి ఆలోచనలు వారిలో పిరికితనానికి తావిచ్చాయి. వారి స్వేచ్ఛ శత్రువుకు బహుమతిగా యిద్దామనుకున్నారు. మృత్యు భయం, బానిసభావం పట్లగల హేయభావాన్ని మ్రింగివేసింది. వారి నా స్థితినుండి రక్షించడానికి వారిలో నుంచి ఓ శూరుడు ముందుకు వచ్చాడు.

అతడు తన మిత్రులతో ఇలా అన్నాడు,

"రాళ్ల ఆలోచనలతో తొలగింపబడవు. ఏమీ చేయలేని వారు శూన్యంలో కలిసిపోతారు. పనికిమాలిన ఆలోచనలతో మనశక్తి వృధా చేయడమెందుకు? లేవండి.—నాతోరండి. అడవిని చీల్చుకుంటూ చివరిదాకా పోదాం ప్రతిదానికి ఆరంభం వున్నట్లు అంతమూ వుంటుంది. పదండి ముందుకు పోదాం."

అతడి కళ్ళు కాంతివంతంగా ప్రకాశిస్తున్నాయి. అతడు శూరుడని వారు గ్రహించారు.

"నీవే నాయకుడివి, నీవెంట వస్తాం" అన్నారు.

అతడు నడిచాడు వారిని నడిపించాడు.

వారిది చాలా కటువైన మార్గం. అడుగడుగునా దాగివున్న దొంగ దిబ్బలు —దారి కడ్డంగా నిలుచున్న బలమైన గోడలాంటి చెట్లు - అల్లిబిల్లిగా అల్లుకొన్న చెట్ల కొమ్మలు — వంకరటింకరగా అన్నివేపులకు పోతున్న పాముల్లాంటి వేర్లు -వేసే ప్రతి అడుగు రక్తాన్ని బలిగోరుతుంది

వారు వెళ్తున్నారు, పోయినకొద్దీ అడవి చిక్కబడుతోంది. శక్తి క్షీణిస్తోంది. వారిలో వణుకుడు ప్రారంభమయింది,

యువకుడు అనుభవంలేనివాడు కాబట్టి నాయకత్వానికి పనికిరాడన్నారు.

అతడు ముందుకు నడుస్తున్నాడు, అడుగులో తొట్రుపాటులేదు. కళ్ళల్లో కాంతి తగ్గలేదు. హృదయంలో కళంకం లేదు.

చెట్లు గుసగుసలాడాయి. గుసగుసలు రొదగా మారింది. తుఫాను వచ్చింది. అడవి పుట్టినప్పటి నుండి గడచిన రాత్రులన్నీ అక్కడ సమావేశమైనట్లుంది. తుఫాను హోరులో చెట్ల నడుమ నడుస్తున్న చిన్న మనుషులు — భయంకరమైన

మృత్యుగీతం లాంటి శబ్దంతో విరిగి పడుతున్నచెట్లు-చెట్ల చివరలనుంచి కనిపి స్తున్న మెరుపుల తళత్తళలు- కనిపించిన మరుక్షణం దీర్ఘశ్యామవుతూ వారి హృద యాలలో రేకెత్తిస్తున్న భయాందోళనలు - మెరుపుల కాంతిలో చీకటిసుంచి పారి పోతున్న వారిని పట్టుకొన్న చెట్ల కొమ్మల చేతులు -

అగమ్యమైన మార్గం. శక్తి మరీ క్షీణించింది. గుండెపగిలింది. ముందు నడుస్తున్న శూరునిపై కోపం వచ్చింది. వారి బలహీనతల్ని వారంగీకరించరు. అతడి నాయకత్వంలో లోపముందని నిందించారు.

"మా శక్తి క్షీణించింది. ఇప్పుడెటూ పోలేని స్థితిలో వున్నాం, ఇందుకు కారణం నీవే. పంగతి తేలుస్తాం," అని వారు శూరుణ్ణి చంపడానికి సిద్ధపడ్డారు.

శూరుడన్నాడు "మాకు నాయకత్వం వహించమన్నారు. వహించాను. నాయకత్వానికి కావలసిన ధైర్యం నాకుంది అందుకే చేపట్టాను. కాని మీరు....? మీరు చేస్తున్న దేమిటి? మీ కోసం మీరుచేసిన ప్రయత్నమేమిటి? గుడ్డిగా గొర్రెల మందలా అనుసరించడం తప్ప?"

శూరుని మాటలు వారి కోపాన్ని తీవ్రతరం జేశాయి. క్రూర మృగాల్లా వారంతా అతనిపై దూకడానికి సిద్ధపడ్డారు. వారు అరిచారు. అరణ్యం ప్రతిధ్వనిం చింది. ఎవరికోసం తానన్నిటికీ సిద్ధపడ్డాడో వారి ముఖాల్లోకి చూశాడు శూరుడు వారు క్రూరమృగాల్లా వున్నారు. వారి ముఖాల్లో మానవత్వపు లక్షణాలు లేవు. వారి నుంచి దయనాశించడం అవివేకమని అతడికి తెలుసు. వారిని పంరక్షించాలన్నదే అతడి తహ తహ, సురక్షితప్రాంతం చేరగలమనే ఆశతో అతడి కళ్లు మెరుస్తు న్నాయి. అతడి కళ్ళల్లోని కాంతి చూచి అతడు రెచ్చిపోయాడనుకున్నారు వారు, అతణ్ణి తోడేళ్ళలా చుట్టుముట్టి చంపడానికి సిద్ధపడ్డారు. వారి ఆలోచన పసిగట్టాడు శూరుడు. వారి ఆలోచనల అజ్ఞానంతో అతడి హృదయంలోని, కళ్ళలోని కాంతి అధికమయింది.

అరణ్యం విషాదగీతం పాడింది. పిడుగులు పడ్డాయి. కుండపోతగా వర్షం కురిసింది.

"వీరిని రక్షించాలంటే నేను చేయగలిగిందేమిటి?" ఉరుముల కన్నా తీవ్రంగా అడిగాడు శూరుడు.

శూరుడు తన రొమ్ము చీల్చుకొని హృదయాన్ని వెలుపలికి తీసిచేతిలో పట్టుకొని ఎత్తి చూపాడు.

హృదయం ప్రకాశిస్తుంది — సూర్యుడిలా ప్రకాశిస్తుంది-ఇంతా కాంతివంతంగా ప్రకాశిస్తుంది. అరణ్యమంతా కాంతివంతమయింది. మానవుని మీది ప్రేమే ఆ వెలుగు. చీకటి వణుకుతూ లోతైన అరణ్యపు గుండెల్లోనో మరెక్కడో దాక్కొనడానికి పోయింది.

వారంతా నిశ్చేష్టు లయ్యారు.

'నాతో నడవండి' అరిచాడు శూరుడు; కాంతివంతమైన తన గుండెచేతిలో పట్టుకొని దారి చూపిస్తూ, వారు మంత్ర ముగ్ధుల్లా శూరుని వెంటనడిచారు.

చెట్లచివరలు గాలికి ఊగిసలాడుతూండగా అడవి మరోసారి గుసగుసలాడింది. ఈ గుసగుసలు అడుగుల చప్పుడులో మునిగిపోయాయి.

మండేగుండె చూపే వెలుగు మార్గంలో వారు అడుగులు చకచకా వేస్తున్నారు.

ముందుకు-యింకా ముందుకు - పైకి-పైపైకి-వేగంగా ధైర్యంగా వెళ్లుతున్నారు.

ఇక్కడొకరు అక్కడొకరు రాలిపోతున్నారు. వారిలో విసుగు లేదు-అలసట లేదు - అసూయలేదు-ఆర్తనాదాలు లేవు - కన్నీరులేదు.

వారి ముందు అరణ్యంలేదు. వెనుక మాత్రమే వుంది.

వారు సముద్రంలాంటి సూర్యకాంతిలో జలకాలాడారు, తుఫాను వెనుక అరణ్యంలో చిక్కుకుంది,

ఎండ-ఎల్లెడలా పరచుకున్న ఎండ - జీవకళతో కళకళలాడుతున్న మైదానం -ముత్యాల్లాంటి వానచినుకులతో వంగిన గడ్డి—గలగలా పారుతున్న నది—

సాయంత్ర మయింది. శూరుడు గుండె చిమ్ముతున్న రక్తపురంగు పులుముకున్నట్టుంది నది.

శూరుడు అంతులేని మైదానాన్ని కలియజూశాడు. ఆనందంగా సగర్వంగా

నవ్వాడు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పుష్పించే మైదానాన్ని ఆనంద పారవశ్యంతో చూస్తున్నాయి అతనికళ్లు, నేలకొరిగి కళ్ళు మూశాడు శూరుడు,

ఆనంద పారవశ్యంలో మునిగిన అనుచరులు శూరుని శరీరాన్నిగాని యింకా మండుతూ వెలుగులు విరజిమ్ముతున్న అతని మండే గుండెనుగాని గమనించేస్థితిలో లేరు.

ఒక పిరికవాడు యిది గమనించి మండే గుండె మీద కాలువేశాడు. నిప్పు రవ్వలు ఆకాశాని కెగశాయి.

తోటి మానవుల కోసం తనగుండెను మండించిన శూరుని వీరత్వానికి చకితయై మైదానం స్తబ్ధత దాల్చింది.

....❀....

....నేను గోర్కీ రచనలు చదివాను, వెంటనే నాలో చీకటి తెరలు తొలగి వెలుతురు ప్రసరించినట్లు కనిపించింది.

....గోర్కీ కేవలం శ్రామికుల, ప్రజల పక్షపాతేకాదు. ఆయన కొత్త తరహా మేధావి వర్గాన్ని సృష్టించాడు. గోర్కీకి ముందు రచయితలు, మేధావులు సంపన్నవర్గంలో నుంచే వచ్చారు, వాళ్ళ రచనలు కూడా ఆవర్గమే చదివింది. అందుకని వాళ్ళ పాత్రలు బాధామయమయిన పేదరికాన్ని గురించి ఆందోళన చెందలేదు. కాని గోర్కీ ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసి రచయితల చదువరుల్ని ఎంతో విస్తృత పరచారు. రచయితలూ, కవులూ జీవితంలో నుంచి తమ రచనలకు ఆధారాన్ని తీసుకొని, వాళ్ళ ఉప్పొంగిన శక్తితో, కొత్త ఆలోచనలతో, కొత్త కలలతో, కొత్త నమ్మకాలతో, ఆశలతో తుఫాను రేకెత్తిస్తే దాంతో మానవజీవిత ఆలోచనలు భూమ్మీదికే పరిమితం కాకుండా చంద్రుడు, సూర్యుడు, నక్షత్రాలు, సర్వసృష్టిలో భాగమవుతాయి.

జాలీ, కరుణలతో అణగదొక్కబడిన జనంలో వాళ్ళ లక్ష్యాన్ని, ఆత్మ స్థైర్యాన్ని, ఆత్మ నమ్మకాన్ని కలిగించగలిగాడు. అది గోర్కీ చేసిన మహత్తర సేవ.

— గుర్బాసింగ్

## వ్యాసం

# భారతదేశమూ, మాక్సిమ్ గోర్కీ

### ప్రొఫెసరు ప్యోతర్ బారన్నికోవ్

రష్యా మహారచయిత మాక్సిమ్ గోర్కీకీ, భారతదేశానికి మధ్య బహు విధాలైన బంధాలు అనేకం. ప్రధాన భారతీయ భాషలన్నిటిలోకీ గోర్కీ రచనలు అనువాదం కావడం ఈ బంధాల్లో ఒకటి. మా నాన్నగారు అకదమీషియన్ అలెగ్సీ బారన్నికోవ్ తన రచనల్లో ఈ విషయం ప్రస్తావించారు.

గోర్కీకీ, వివిధ భారతీయ రచయితలూ, సంస్థలతో గల సంబంధాలను గురించి ఇక్కడ చెప్పదలచుకున్నాను. భారతదేశం గురించి గోర్కీ వైఖరిని కూడా ప్రస్తావిస్తాను. వారి రచనల సంపుటాల్లోని వివిధ వ్యాసాలూ, లేఖల్లో ఇది ప్రతిబింబిత మవుతూంది.

భారతదేశం పట్ల గోర్కీ ఎల్లప్పుడూ ఆసక్తి కనబరిచారు. దాని చరిత్రా, సంస్కృతులతోనూ, దాని ఉత్తమ పుత్రులు మహాత్మాగాంధీ, రవీంద్రనాథ టాగూర్‌లతోనూ ఆయనకు పరిచయం ఉంది. చాల మంది భారతీయ నాయకులతో ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపేవారు. పత్రికా రచయిత్రీ, విప్లవకారుడైన కృష్ణవర్మ సహయోధురాలూ అయిన బి. ఆర్. కామా కు 1912 సెప్టెంబరులో ఆయన ఇలా జాబు రాశారు:

"భారతీయ మహిళ, ఆమె ప్రస్తుతస్థితి. భారత స్వాతంత్ర్య పోరాటంలో ఆమె పాత్ర అన్న అంశంపై రష్యా పత్రికలకు మీరొక వ్యాసం రాయలేరా? గంగానదీ తీరవాసుల, భారత మహాదేశ ప్రజాస్వామికవాదుల? మహిళల జీవితమూ, పోరాటం గురించి రష్యన్ ప్రజాస్వామికవాదులకూ, రష్యన్ మహిళలకూ మీరు ఎరుక పరచినట్లయితే, వారు మీకెంతో కృతజ్ఞులుగా ఉంటారు".

1912, అక్టోబరు 31న బి. ఆర్. కామా ఇలా జవాబు రాశారు :

"నా కాలమూ, శ్రమా అంతా నా దేశం ఆశయానికి, దాని పోరాటానికే వినియోగమవుతూంది. అయినా, నా దేశం ఆశయం గురించి నేనొక వ్యాసం రాయ గలిగితే, మీకోరిక నెరవేర్చడానికి సకల విధాలా ప్రయత్నిస్తాను." భారత విప్లవ యోధుడైన వి.డి. సావర్కర్ ద్వారా ఒక పుస్తకం పంపాననికూడా ఆమె గోర్కీకి రాసింది

కృష్ణవర్మతో కూడా గోర్కీ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. బ్రిటిష్ వలస పాలకులు ఆయనను ఇంగ్లాండుకు ప్రవాసం పంపారు. "ఇండియన్‌సోషాలజిస్ట్" అనే పత్రికను అయన ఫ్రాన్సునుండి ప్రచురించేవారు. ప్రవాస భారతీయ దేశభక్తుల పత్రికగా అది ఉండేది. భారతదేశం గురించి రష్యన్ పాఠకులకోసం ఒక వ్యాసం రాయవలసిందని కోరుతూ కృష్ణవర్మకు గోర్కీ ఒక ఉత్తరం రాశారు. 1912. అక్టోబరు 28 న కృష్ణవర్మ ఇలా జవాబు రాశారు :

"రాజకీయ స్వాతంత్ర్యాన్ని మనసారా ప్రేమించేవారూ, తమకు మాత్రమే కాకుండా, ప్రపంచమంతటా ఉన్న పీడిత జాతులన్నింటికీ కూడా స్వాతంత్ర్యం ఉండాలని కోరేవారూ యూరప్‌లో కొద్దిమంది ఉన్నారని తెలిసి నేనెంతో సంతోషిస్తున్నాను." తనకు పని ఒత్తిడి చాల ఎక్కువగా ఉందనీ, అందుచేత రష్యన్ పత్రికకు వ్యాసం రాయలేనని కృష్ణవర్మ రాశారు. అయితే తన పత్రిక నొకటి గోర్కీకి పంపారు. పంపుతూ ఇలా రాశారు :

"ఇందులోని విషయాలను ఆధారం చేసుకుని మీరు స్వేచ్ఛగా ఒకవ్యాసం రాసుకోవచ్చు నా భావాలను ప్రతిబింబించే మేరకు నన్ను పేర్కొనవచ్చును." కృష్ణవర్మ చేసిన ఈ సూచనను గోర్కీ పాటించారు.

1923, ఫిబ్రవరి 13న గోర్కీ, రోమారోలాకు రాసిన ఒక జాబు మనకు తెలిసినదే. భారతదేశం గురించి అందులో ప్రస్తావించారు. ఆ జాబులో గోర్కీ ఇలా రాశారు :

"మీరు వాగ్దానం చేసిన వ్యాసాలతోపాటు, గాంధీని గురించి మీరు రాసిన వ్యాసంకూడా పంపరూ? దానిని పంపవలసిందిగా మిమ్మల్ని మరీ మరీ కోరుతున్నాను. ఆయనను గురించి మాకు పత్రికల ద్వారా మాత్రమే తెలుసు. తాము పూర్తిగా అంగీకరించిన కొన్ని అభిప్రాయాల మూలాధారాలను రష్యన్లు తెలుసు

కోవడం మంచిది. భారతీయుల మత తాత్విక భావాల ప్రభావం కనిపించేది ఒక్క లియో టాల్‌స్టాయ్‌లోనే కాదు. ఈ ప్రభావం ప్రజలకు కూడా తెలుసు. 'నెతోవ్‌శ్చి' 'మనది కాదు'— అనే ఒక మతంవారు మా దేశంలో చాలకాలంగా ఉన్నారు. ఈ మతంవారు ప్రభుత్వాన్నీ, వ్యక్తిగత ఆస్తినీ, కుటుంబాన్నీ, తమ సంకల్పానికి వ్యతిరేకంగా ఏలాంటి దౌర్జన్యాన్నీ గుర్తించరు. అయినా వారు పరమసాధువులు. కోపం ఎరుగరు, తమ భావాలను ఎవరిమీదా రుద్దరు. వీరి ప్రాపంచిక దృక్పథం భారతదేశానికి సంబంధించిన దనేంతుకు సందేహం లేదు. రష్యన్ ఖ్లిస్‌త్ఫ (ఈ మతంవారి పేరు - వ్యాసకర్త) మతసంబంధమైన పాటల్లో "పురాన్", "మాయ" "దేవ", "సారస్వన్", "అగ్ని" మొదలైన సంస్కృతపదాలు కనబడుతున్నాయి. ఆమాటల అర్థాలు వారికి తెలియవు. బహుశా కాకసస్ ప్రాంతాల "ప్రిగునీ" లకు (దుమికేవారు) చెందిన ఒక తెగవారు ఈ పాటలను రష్యాకు తెచ్చిఉంటారు. వారికి "దేశద్రిమ్మరి సన్యాసుల"తో సంబంధం ఉండేది. కొన్ని లక్షణాలను బట్టి చూస్తే వారికి ఫకీరులతో కూడా సంబంధం ఉండేదని స్పష్టం."

గాంధీని గురించి రోమారోలా రాసిన వ్యాసం గోర్కీకి అందింది. "బెసెదా" (సంభాషణలు) అన్న పేరుతో 1923లో ఆయన బెర్లిన్‌లో ప్రచురించిన పత్రిక మొదటి సంచికలోనూ, రెండవ సంచికలోనూ ఆ వ్యాసం అచ్చయింది. ఆ రోజుల్లో గోర్కీ వైద్యంకోసం విదేశాల్లో ఉండేవారు. 1923, ఆగస్టు 6న బెర్లిన్ నుంచి ఆయన రోమారోలాకు ఇలా జాబు రాశారు: "మీ 'మహాత్మాగాంధీ' వ్యాసం మాస్కోలో 'క్రాస్నాయానవ్' (అరుణవార్తలు) అన్న పత్రికలో ప్రచురిస్తున్నారు".

రోమారోలా రాసిన "మహాత్మగాంధీ" పుస్తకం లెనిన్‌గ్రాడ్‌లో, 1924లో వెలువడింది.

భారతదేశం గురించిన చాలా పుస్తకాలు గోర్కీకి తెలుసు. ముఖ్యంగా, భారతీయ సంస్కృతి రష్యన్ పరిశోధకుడు అకడమిషియన్ సెర్గీ ఓల్డెన్‌బర్గ్ రచనలు ఆయనకు తెలుసు. తన "సంపాదక లేఖల్లో" ఆయనకు గోర్కీ పేర్కొన్నారు. "మన ప్రాచ్య సంస్కృతి పరిశోధకులు బూరవ్ అంతటిలోకీ ఉత్తములని ఇప్పుడు గణుతికెక్కారు" అని గోర్కీ రాశారు.

భారతదేశం గురించి ఇంగ్లీషు రచయితలు రాసిన పుస్తకాలతో కూడా గోర్కీకి పరిచయం ఉంది. "పోగొట్టుకున్న డొమినియన్–– భారతదేశంలోని ఇటీవలి రాజకీయ ఘటనల సింహావలోకనం" అని, అలన్ కార్థిల్ రాసిన పుస్తకాన్ని ఆయన ప్రత్యేకంగా అధ్యయనం చేశారు. దాని రష్యన్ అనువాదం మాస్కోలో 1925 లో వెలువడింది.

"విదేశాల్లోని సంఘటనలు" అన్న శీర్షిక కింద రాసిన వ్యాసాల్లో, ఒక వ్యాసాన్ని గోర్కీ పూర్తిగా భారతదేశానికి వినియోగించారు. సెయింట్ పీటర్స్‌బర్గ్ నుండి వెలువడిన "సోవ్రెమెన్నిక్" (సమకాలికం) అన్న పత్రికలో అది 1912లో అచ్చయింది. కృష్ణవర్మ పంపిన సమాచారాన్ని ఆధారం చేసుకొని రాసిన వ్యాసమది.

వ్యాసారంభంలోనే గోర్కీ ఇలా రాశారు : "జాతీయ స్వాతంత్ర్యం కోసమూ, ఇంగ్లాండు క్రూర సంరక్షకత్వానికి వ్యతిరేకంగానూ భారతీయుల ఉద్యమము ఎంత వేగంగా పెరుగుతూ ఉందో చూడండి."

భారతీయల్లో "విశ్వాస పూరితమైన ఒక కొత్త ఆశాభావం" గురించీ, "ఇటీవలి సంవత్సరాల్లో కారుమేఘంలాగా ఉండిన అనుమానాలు" వైస్రాయి రాకతో పటాపంచలు కావడం గురించీ, వలస పాలకులుచేసిన బూటకపు ప్రకటనలను గోర్కి - ఉదహరించారు.

"అధికారుల రాత పూర్వకమైన అనుమతిలేనిదే, వైస్రాయి రావడానికి రెండు గంటలు ముందుగా ఎవ్వరూ కూడా తమతమ ఇళ్ళల్లోంచి బయటికి కదలడానికి వీల్లేదు" అని చెప్పి, గోర్కి ఈ బూటకపు ప్రకటనలను బట్టబయలు చేశారు." పోలీసు చర్యలతో నిలబెట్టవలసిన విశ్వాసభావం, నిజంగా చాల పెద్ద 'భావమే' అని గోర్కి వ్యాఖ్యానించారు.

"సామాజిక, రాజకీయ కార్యకలాపాలను భారతీయులు తమ చేతుల్లోకి తీసుకోవలసిన సమయం ఆసన్నమయిందనీ. గంగానదీ తీరంలో ఇంగ్లీషువారి పాలనకు కాలదోషం పట్టిందన్న భావప్రకటనలు భారతదేశంలో నానాటికి మరింత తరుచుగా వినిపిస్తున్నాయ" నీ, ఆ రష్యన్ మహా రచయిత రాశారు.

"జాతీయవాది అయిన సావర్కార్‌ని ప్రభుత్వం హింసిస్తూన్న తీరును చూస్తే ఈ ప్రభుత్వం ఎటువంటిదో స్పష్టమవుతుంది. ఆయనపై విచారణ అంతా రహస్యంగా జరిగిన విషయం అందరికీ తెలుసు. ఆ విచారణ గురించిన వార్తలు ప్రచురించరాదని నిషేధించారు. ఆయనకు 48 ఏళ్ళ ఖైదు శిక్ష – అంటే 1960 వరకు విధించారు. తన భార్యకు ఏడాదికి ఒక్క ఉత్తరం మాత్రమే రాసుకోడానికి అనుమతి ఇచ్చారు" అని, ఆయన రాశారు.

జార్జి పట్టాభిషేకం సందర్భంలో బరోడామహారాజు గైక్వాడ్ 'స్వతంత్రంగా' వ్యవహరించాడు. అందుకు ఇంగ్లీషు కన్సర్వేటివ్ పత్రికలు అతనిమీద "ప్రత్యేకత కోసం ప్రాకులాడేవాడు. వాగాడంబర ప్రియుడు, మొదలయిన ఆరోపణలు సాగించాయ"ని గోర్కి రాశారు.

ఈ సందర్భంలో "డైలీ ఎక్స్‌ప్రెస్" పత్రిక ఇలా రాసిందని గోర్కి ఉదహరించారు 'తిరుగుబాటుదారులకు బరోడా సంస్థానం ఆశ్రయంగా ఉందని భారతదేశ ప్రభుత్వానికి చాల కాలంగా అనుమానం ఉంది. గైక్వాడ్ తరుచు యూరప్ వస్తున్నారు ఆ సందర్భాల్లో ఆయన విప్లవకారుడైన కృష్ణవర్మతో సన్నిహిత సంబంధాలు పెట్టుకుంటున్నారు." గైక్వాడ్‌ని గద్దె నుండి తొలగించాలని "డైలీ టెలిగ్రాఫ్" పత్రిక కోరింది. బెదిరిపోయిన ఆ మహారాజు, కృష్ణవర్మ 1907లో ఇంగ్లాండును వదిలిపెట్టినది మొదలుకొని తాను అతనిని కలుసుకొనలేదని 'టైమ్స్' పత్రికకు టెలిగ్రామ్ ఇవ్వవలసి వచ్చింది.

ఈ వాస్తవ విషయాలను పేర్కొని గోర్కీ ఇలా రాశారు: "భారతీయులకూ, ఇంగ్లీషు వారికీ మధ్య ఉన్న పరస్పర 'రాజకీయ' సంబంధాలు ఇటువంటివి. గౌరవనీయులైన సోషలిస్టు కెయిర్‌గార్డి భారతదేశం వెళ్ళడంవల్ల, భారతీయుల దుర్భర పరిస్థితులూ, ఇంగ్లీషువారి మొరటు పీడనా వెల్లడయి. నిప్పుమీద నెయ్యి పోసినట్లయింది."

మరీ దుర్భరమైన భారతీయ మహిళల జీవన పరిస్థితులనూ, వాటివల్ల వారిలో మరణాలు చాల పెద్ద సంఖ్యలో ఉండడమూ గోర్కీ గమనించకపోలేదు, 1911 భారతీయ జనాభా లెక్కల నుండి అనేక వివరాలను ఉదహరించి గోర్కీ,

ఈ విషయంలో తన నిర్ధారణలను రుజువు చేశారు. గణాంక కమిషన్ అధ్యక్షుని నిర్ధారణను గోర్కీ ఈ విధంగా ఉదహరించారు.

"జననాల విషయంలో స్త్రీ పురుషుల నిష్పత్తిలో యూరప్‌కీ ఇక్కడికీ పెద్ద వ్యత్యాసం లేదు. కాని, ఆ తరువాత పరిస్థితులు స్త్రీలకు ఎంతో అననుకూలంగా ఉన్నాయి. వారు కాయకష్టంతో జీవిస్తున్నారు. ఈ స్థితి, సామాజికంగా దేశానికి మహా ప్రమాదకరం."

భారతదేశం పట్ల. దాని సంస్కృతి, చరిత్ర, స్వాతంత్ర్య పోరాటాల పట్ల గోర్కీ ఎంతో శ్రద్ధ చూపారని, ఈ విధంగా మనకు స్పష్టమవుతుంది. తన అవసానదశలో కూడా ఆయన భారతదేశాన్ని జ్ఞాపకం ఉంచుకున్నారు. 1934 లో మాస్కోలో జరిగిన అఖిల యూనియన్ రచయితల ప్రథమ మహాసభలో ప్రసంగిస్తూ ఆయన ఇలా అన్నారు :

"సోవియట్ రచయితల ద్వితీయ మహాసభను తూర్పు, పశ్చిమ దేశాలకూ.... భారతదేశానికి చెందిన రచయితలు చాలమంది అలంకరిస్తారన్న నమ్మకం నాకుంది, కళా, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక శాస్త్ర ప్రపంచంలోని అత్యంత నిజాయితీ పరులందరి సమ్మేళనం ప్రాంగణంలో మన మున్నామనేందుకు సందేహంలేదు."

ఈ మహా రచయిత కలలూ, ఆశయాలూ ఫలించాయి. భారత ప్రజలు వలస సంకెళ్ళను తెంచుకొని స్వతంత్రాభివృద్ధి మార్గాన ముందుకు సాగారు, సాహిత్యం, కళ, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాలకు చెందిన చాలమంది భారతీయ ప్రముఖులు మనదేశం- అత్యుత్తమ రచయితా. మానవతావాది అయిన మాక్సిమ్ గోర్కీని మానవజాతికి ప్రసాదించిన దేశం వస్తున్నారు.



"సోవియట్ ప్రజల స్నేహానికి తండ్రి గోర్కీ. ఆయన మా అంతర్జాతీయ సోదరభావానికి బాపుటా, ఆయన సోవియట్ నాగరికతలోని అన్ని గుణాల ఐక్యతా భావం."

-చింగిజ్ ఐత్‌మతొవ్

# అరనిజ్వాల గోర్కీ

## ముల్క్‌రాజ్ ఆనంద్

నా రచనలో అత్యధిక భాగం విషయంలో నేను మాక్సిం గోర్కీకి రుణ పడి వున్నాను. భారతదేశ రచయితలలో 50 ఏళ్ళకు పైబడ్డ వారంతా మాక్సిం గోర్కీ ఒరవడి కెంతో రుణపడి వున్నామని నా మిత్రులనేక మంది చెప్పినమాటను నేను ధ్రువపరుస్తున్నాను. మనమాయనను జ్ఞాపకం ఉంచుకోడానికి ఆ ఒక్క కారణమేచాలు. గత చాలా ఏళ్ళుగా నేనూ, భారత మేధావి వర్గానికి చెందిన నా సహచరులూ గోర్కీ నుంచి నేర్చుకొన్న రెండు, మూడు విషయాలను గురించి మీ ముందు చెప్పదలచుకొన్నాను.

మొట్టమొదట, మనము పరాధీనులంగా వున్నప్పుడు, గోర్కీ రాసిన "అమ్మ"ను ఎలా చదివే వాళ్ళమో, స్వాతంత్ర్య పోరాట భావనకు ఎలా ఉత్తేజితు లయ్యేవాళ్ళమో గుర్తు వస్తుంది. పంజాబులో పదకొండు రోజుల జైలు జీవిత అనుభవంతో నేను అర్ధరాత్రివేళనే గోర్కీ రచనలు చదివాను. పగటిపూట ఎప్పుడూ చదవలేదు. ఆరోజులలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గోర్కీ రచనలను భారతదేశం లో నిషేధించి వుండడమె కారణం. గోర్కీ పుస్తకాలు చదువుతూంటే పోలీసు వాళ్ళు పట్టుకుపోయేవారు. తరువాత ఫలితాలు ఎలా వుండేవో మీ అందరికీ తెలుసు. ఆ విషయం బహుశా మీలో చిన్న వయస్సువాళ్ళకి తెలిసి వుండదు. గోర్కీ మహత్తర వ్యక్తిత్వంలో కదులాడుతున్న చైతన్యం ఎటువంటిదో తెలుసు కోవాలనే జిజ్ఞాసను ఆ పరిస్థితులు ఎంతో ప్రోత్సహించాయి. ఆ చైతన్యమే మాలోని చైతన్యాలకు జన్మదాత, నిజాయతీగా వుండాలనేది మేమాయననుంచే నేర్చుకొన్నాం. ఎప్పుడూ ఎరగనీ, చూసీ, వినీవుండని అజ్ఞాత రష్యన్ ప్రజల లోని పేదల్ని, సంఘ బహిష్కృతుల్ని. ఉన్నత తరగతులు త్రోసి పుచ్చినవారిని, అతఃపూర్వం సాహిత్యంలోకి తీసుకురాదగినంతపాటి గౌరవ ప్రతిష్ఠలు లేనివారిని రష్యన్ సాహిత్యంలోకీ, ఆ విధంగా ప్రపంచ సాహిత్యంలోకీ తీసుకొచ్చిన మొట్టమొదటి రచయిత ఆయన,

హాజీ మురాద్, సెవాస్తొపోల్ రేఖా కథలు, కొన్ని చిన్న కథలలో టాల్‌స్టాయ్ ప్రజల్ని గురించీ. ఈనాటి నూతన సోవియట్ రిపబ్లిక్‌లోని ఆసియా వాసుల్ని గురించీ రాశారు. నిరాకృతుల్ని గురించి మరెవ్వరూ రాయలేదు. దోస్తోయెవ్‌స్కీ అవమానితులూ, అధఃకృతులూ గురించి రాశాడు. కాని ఆయన దృక్పథం వేరు. మాకర్ ఛుద్రా మంచి చివరకంటా గోర్కీ సమాజం బహిష్కృతుడిని గురించి ఒక వినూత్న భావనను సాహిత్యంలో ప్రవేశపెట్టాడు. "మనిషి మానవుడెల్లా అవుతాడ"నే ఆలోచన ఆయనకు ఉత్సాహాన్ని ఇచ్చింది. సాహిత్య అర్హతలేని జనం సాహిత్యంలోకి రావచ్చునని ఆయన భావించారు. నిజానికది కొత్త భావనే. 1928 లో నేను లండన్‌లో వున్నప్పుడు గోర్కీ కథలు—ఇరవ య్యారుగురు మగవాళ్ళు. ఒక బాలిక, మరికొన్ని కథలూ అన్న దానిని చదివాను. దానిని శ్రీమతి కాన్‌స్టాన్స్ గార్నెట్ అనువదించింది. డక్‌వర్త్ కంపెనీవారు ప్రచురించారు. దాంట్లో ఎడ్వర్డ్ గార్నెట్ రాసిన పీఠిక వుంది. ఉదారవాది అయిన ఆ పెద్దమనిషి దానిలో రాసిన దానిని నేను మరవలేను. సాహిత్యంలో చెత్తనూ, ధూళినీ ఇంగ్లీషువాడు భరించలేడట. సాహిత్యంలో కురూపుల్ని చూడ గోరడట, ఏక్కడో దూరాన వున్న ఈ స్టెప్పీమైదానాల ప్రజలనూ, యూరేషియా ప్రజలనూ చూడ నిచ్ఛగించడట.

యూరేషియాలోనే గాక, ఆసియాలోని సమాజ బహిష్కృతులను కూడా ఎత్తుకొని రాసే గోర్కీ అంటే నేనేమనుకొంటానో ఇప్పుడు మీరు బహుశా

ప్రపంచ సాహిత్యంలో కష్టజీవుల అభ్యున్నతికి అంకితమైన రచయితకు పర్యాయ పదం గోర్కీ.

మనిషిని మనిషిదోచుకోడానికి వ్యతిరేకంగా తన కలాన్ని కత్తిగా ఉపయోగించాడు. సమాజంలోని దోపిడీతనాన్ని ఎత్తి చూపడానికి సాహిత్యపు వెలుగయ్యాడు.

—హరిదత్ శర్మ

అర్థం చేసుకోగలుగుతారు. ఆయన మా గురుపాదులయ్యారు. గోర్కీ రాసిన తర్వాత దుఃఖం, దూళి గురించి రాసినందుకు ఎడ్వర్డ్‌గార్నెట్ ఆయనను అభినందించిన వెనుక యూరపు, ఆసియా, ఆఫ్రికాలలో నాలుగో దశాబ్దిలో సాహిత్యోద్యమం రానే వచ్చింది. ఎంతో ప్రతిభావంతులయిన రచయితలు మాల్రా, సెలినే, హెమింగ్వే, షాక్నర్, రాల్ఫ్‌ఫాక్స్, జాక్ లిండ్సే, మావో-టున్, షోలకొవ్ మొదలయినవారు ఎన్నెన్నో రాశారు. సాహిత్యంతో గోర్కీ దారి చేశారు గనకనే అదంతా సాధ్యం అయింది ఆ విధంగా గోర్కీ నవ్యసాహిత్య ప్రవక్త అనాలి.

సాహిత్యంలో కొత్త మానవులను ప్రవేశపెట్టడమేగాక సాహిత్యం అంటేనే ఒక అసాధారణమైన భావనను ఆయన తీసుకొచ్చారని నా అభిప్రాయం! అంతవరకూ సాహిత్యం మానవుడి క్రియాకలాపాలనే ఇంచుమించు పరిశీలిస్తూండేది. ఒక్క టాల్‌స్టాయి మానవ విలువలను ప్రవేశపెట్టాడు, పాశ్చాత్య దేశాలలో రచయిత మానవుని స్థితిగురించే రాయడం చూస్తాం, తన పాత్రలనుంచితానేమి కోరుతున్నదీ ఏ రచయితా సూచించడు. గోర్కీ వచ్చేవరకూ సాహిత్యంలో విప్లవకర కాల్పనిక చిత్రణ కావాలనే వాంఛే పెట్టలేదు. పుట్టుబడిదారీ ప్రపంచం సాధారణంగా పట్టి ప్రచారం అనేసే దానిని గోర్కీ సాహిత్యంలోకి ప్రవేశపెట్ట సాహసించారని నా వుద్దేశం. కళ యావత్తూ ప్రచారమే. అజంతా చిత్రకళ బౌద్ధ మతానికి ప్రచారం; ఎల్లోరా శిల్పాలు హిందూమతప్రచారం, పాశ్చాత్య నవలలోని కళ బూర్జువావర్గానికి వ్యతిరేకంగా మానత్వం కోసం చేస్తున్న ప్రచారం. మానవతావాది అయిన గోర్కీ మానవుణ్ణి గురించి, అతని పరిస్థితుల్ని గురించి, మాట్లాడ సాహసించారు. అదెంత దుర్భరమో చెప్పడానికే కాదు, మానవుడు ఎంతటివాడు కాగలడో సూచించారు కూడా, ఆ విధంగా ఆయన మానవుడికోసం ప్రచారం చేశారు.

---

గోర్కీ ఒక మహారచయిత. ఇక్కడ ఏ దేశం అనే ప్రసక్తే రాదు. ఒక రచయితను భారతీయుడా, యూరోపియనా అని చూడకూడదు. ఆయన ఏది రాసినా అది అందరి ప్రయోజనం కోసమే. — ప్రేమ్‌చంద్

---

చిన్నకథలు మొదలుకొని క్లిమ్ సామ్‌గిన్ వరకూ గోర్కీ రచనలలో ఆయన వుద్దేశం విస్పష్టమే. మానవుడు తన్ను పెద్దచేసుకోగలడు, ఆ భావం రష్యను సాహిత్యంలో ఆనాటికి కొత్త. టాల్‌స్టాయ్ కూడా ఆ భావాన్ని తేలేదు. మానవుడు ఎలా వుండగలడన్న మహా చిత్రాన్ని రచయితా వూహించగల దశకు గోర్కీతో అంకురార్పణ జరిగింది. రష్యా విప్లవానికి పూర్వంనాటి మేధావి వర్గానికి ఇది ఒక ప్రామాణిక సత్యం అయింది మానవుడు తన్ను ఉన్నతుడిని చేసుకోగలడనే భావం ఆయన కాలంనాటి రచయితల రచనలను ప్రాభావితం చేసింది. మానవుడు తనను ఉన్నతుడిని చేసుకోగలడని గోర్కీ చెప్పగలిగారు. సమాజాన్ని మార్చడం అనే ఈ భావనకు వాతావరణాన్ని సృష్టించారు, బహుశా ఇందుచేతనే రష్యా విప్లవం యువకులలో హెచ్చరికనూ, చైతన్యాన్నీ ప్రోదిచేసి, మానవుడిని ఉన్నతుణ్ణి చేయాలనే పట్టుదలను ఇచ్చి వుంటుంది, ఇంతకు పూర్వం చెప్పిన దానికన్నా గోర్కీ చేసిన ఈ పని ఇంకా ఎక్కువ ఉపకారం ఏమంటే అది బలహీనులలోనూ, పీడితులలోనూ ఒక విశ్వాసం కలిగించింది. విప్లవం మనుష్యుడిని మార్చగలదనే విశ్వాసం కలిగించింది.

ఆ విధంగా గోర్కీ విప్లవ ప్రవక్తలలో ఒకరయ్యారని చెప్పవచ్చును.

గోర్కీ గొప్పతనాన్ని సమర్థించేటందుకు ఈ రెండు విషయాలూ, ఈ రెండు ముఖ్యమైన తోడ్పాట్లూ చాలు.

గోర్కీ వ్యక్తిత్వం పాశ్చాత్య సాహిత్యంమీద ఎంత ప్రగాఢమో నేను నిరూపించగలను. రొమారోలా మొదలు హెన్రీ బార్బూస్ వరకూ, నాలుగొ

---

మా నగరం ప్రపంచానికి ఒక గొప్ప శ్రామిక రచయితను ప్రసాదించినందుకు మాకెంతో గర్వకారణంగా ఉంది.

- వ్యచెస్లెవ్ సైచ్చికొవ్

దశాబ్దినాటి రచయితలూ అందరూ కూడా సమాజన్ని మార్చాలనే ప్రోత్సాహం ఈ రష్యా విప్లవ ప్రవృత్తి నుంచే వచ్చిందని ఒప్పుకొన్నారు. టాల్‌స్టాయ్, చెకోవ్, తదితరులు వ్రాసిన 'జ్ఞాపకాలు' మీరు చదివారేమో తెలియదు. గోర్కీని గురించి లెనిన్ రాసిన వ్యాసం చదివారో లేదో ఎరుగను ఎప్పుడేనా ఆ పుస్తకం మీ చేతికి వస్తే, లెనిన్ గోర్కీని పోరాటంతో సమభాగులలో ఒకనినిగా, ఒక్క రచయిత మాత్రమే చేయగల విధంగా, రష్యాలో విప్లవం తప్పదనీ చైతన్యాన్ని తన ప్రత్యేక పద్ధతిలో తెచ్చిన వారిలో ఒకనినిగా పరిగణించినట్లు అర్థం చేసుకోగలరు.

అంతకన్న దానిని గురించి మరి అధికంగా చెప్పను.

భారతదేశంలో యువ మిత్రులు చాల మంది గోర్కీ రచనలను చదవడం లేదని చెప్పడానికి విచారపడుతున్నాను. వానికి బదులు సార్త్రేను చదువుతూండి వుంటారు. అవీ అంత మంచివే తప్పలేదు. మానవుని ఔన్నత్యాన్ని ఆయన సమర్థిస్తారు. అయినా, యువ రచయితలు చాలమంది గోర్కీ రచనలను చదవక పోవడాన్ని నేను నిరసిస్తాను. వారు టాల్‌స్టాయ్‌నీ చదవరు. అసలు వారు చదివేదే తక్కువని నా అభిప్రాయం. ఆశ్చర్యపడనక్కర్లేదు. వారంతకన్న ముఖ్యమైన పనిలో, చాల సమాజంలో భౌతికావసరాలను వెళ్ళమార్చే పనిలో చిక్కుకొని వున్నారు. చాల కష్టమైన పరిస్థితి— బాధాకరమైన పరిస్థితీను ఇది. ప్రాక్పశ్చిమాలు రెండింటా రచయితలంతా మూడో ప్రపంచ యుద్ధ మహా ప్రమాదంలో వున్న సమాజంలో బతుకు వెళ్ళ మార్చుకొనేందుకే ప్రయత్నం చేస్తున్నారు. అందుచేత ప్రపంచంలో మేధావి వర్గం అన్యాధా పనిలో మునిగివుండడం సహజమే, కాని గత కాలంనాటి చైతన్యంతో సమకాలీన పరిజ్ఞానాన్ని సమన్వయపరచడం అవసర మని భావిస్తాను.

రచనల్లో కొత్త మార్గాలు తొక్కడానికై వుత్సాహం వర్తమాన కాలం నుంచే రావడం సాధ్యం కాకపోవచ్చు. ఉదాహరణకి నేనేదన్నా కొత్త నవల రాయదలుచుకొంటే. గోర్కీ యొక్క మానవతావాదం నుంచే మరల ప్రారంభిస్తానేమో. అది చాదస్తపు మానవతావాదం కాదు. మానవతావాదం ఎన్నడూ

చాదస్తం కాదు. మానవుని ఔన్నత్యాన్ని పునస్సంస్థాపించడం ఎప్పుడూ చాదస్తం కాదు.

అందుచేత మన కాలంలో కూడా గోర్కీ గొప్ప ఉత్తేజం కలిగించగలడు. ఆయన మన సమాజానికి కూడా సంబంధించినవాడే, ఏమంటే, మనం ఇంకా మానవ సమస్యలను పరిష్కరించనే లేదు కనుక, ఆ సమస్యలను మనం స్పృశించాము అంతే, ఏం చెయ్యాలని నేను చెప్పవలసిన పనేలేదు. అయితే మన నూతన రచయితలు భాషను గురించో, డబ్బును గురించో దెబ్బలాడుకోవడం తగ్గించితే చదవాలని, రాయాలని, మానవుడిలో అతని స్థితిగతులను గురించిన పరిజ్ఞానం, అతని ప్రస్తుత గమ్యాన్ని గురించిన జ్ఞానం కలిగించాలనీ ఉత్సాహ ప్రోత్సాహాలు కలుగుతాయి. మనమీ ప్రపంచంలో నెగ్గుకురాగలమని మనకు నమ్మకం ఉందా ? ఏభయ్యేళ్ళలో సోవియట్ ప్రజలు చేసినట్లు, ఆసియా తన ప్రజను తయారు చేయగలమని నమ్ముతున్నామా ? అసలు మనకా నమ్మకమేలేదా? నిన్ననే ఒక మాజీకమ్యూనిస్టు రచయిత తనకింక చరిత్రమీద ఏమాత్రం నమ్మకం లేదన్నాడు. ఈ బాహ్య జగత్తునుంచి బయటపడాలని ఆయన కోరిక. చరిత్రకు వెలుపల వుండగోరే వారిని నిందిస్తున్నాననుకోవద్దు. అసందర్భ పరిస్థితులనుంచి బయటపడడం ప్రధానం. నిత్య జీవిత పోరాటాన్ని, మనిషిని మానవుడిగా చేసేందుకయి పోరాటాన్ని చాలమంది తట్టుకోలేరు. కాని, అది తప్పనిది, ఆయినా, మన మేధావులు బాహ్య జగత్తునుంచి బయట పడాలనీ, నిశ్శబ్ద నిరాకార ప్రపంచంలో జీవించాలనీ కోరే ధోరణిని నేను హర్షించలేను.

"సాహిత్యం ప్రపంచ హృదయం" అన్నాడు మాక్సిమ్ గోర్కీ. రచయిత ఆ హృదాయం యొక్క స్పందనం అంటాను నేను. సజీవమయిన హృదయం లేనిదే ప్రాణమూ వుండదు.

భారతదేశపు యువ రచయితలు గోర్కీ యొక్క ఈ సత్యానికి అంకితం కావాలని కోరుతాను.

....❀....

# మన దేశభాషలో గోర్కి "అమ్మ"

—శ్రీ వీరేంద్ర త్రిపాఠి

రష్యాలో. 1917లో జరిగిన అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం మానవజాతి చరిత్రలోనే ఒక నూతన శకానికి నాంది పలికింది. భారతదేశ ప్రజాసామాన్యం మీదా, ప్రత్యేకించి అభివృద్ధి కాముక భావుకుల మీదా అది బ్రహ్మాండమైన ప్రభావం ప్రసరింపజేసింది. కార్మిక కర్షక రాజ్య స్థాపనను గురించి యుగయుగాలుగా కంటున్న కల, ప్రపంచంలో ఆరింట ఒక భాగంలో నిజమయింది. కవులనూ, సామాన్యులనూ కూడా అది సమానంగా ఉత్తేజితుల్ని చేసింది. వీరోచిత రష్యన్ ప్రజల విముక్తి పోరాటం వారిని ప్రబుద్ధుల్ని చేసింది. తమను ఎదుర్కొంటున్న ప్రధాన రాజకీయ, సామాజిక, తాత్విక సమస్యలకు పరిష్కారాలను, రష్యాలోని సంఘటనల నుండి గ్రహించేందుకు వారు ప్రయత్నించారు. రష్యన్ల విముక్తి పోరాట అనుభవాన్ని అధ్యయనం చేసేందుకు వారు కృషి చేశారు. సంఘటిత కార్మికోద్యమం యొక్క చారిత్రక కర్తవ్యాన్ని భారత ప్రజల దృష్టికి తెచ్చారు. సోషలిజం ప్రాతిపదికపై వివిధ జీవిత రంగాల్లో రష్యనులు సాధించిన విజయాలను వారు బాగా ప్రచారం చేశారు. పాఠకులూ, రచయితలూ రష్యన్ సాహిత్యం పట్ల ఆసక్తి చూపనారంభించారు. వాస్తవికత, ఉభయ దేశాలపరిస్థితుల సామ్యమూ కారణంగా నవలలూ, చిన్న కథలు భారతీయ పాఠకులను ఆకర్షించాయి. టాల్‌స్టాయ్, చెకోవ్. తుర్గెనీవ్, దాస్తోయెవ్‌స్కీ, గోర్కీల నవలలు ఎంతగానో ప్రశంసల నందుకున్నాయి వాటిలో కొన్ని భారతీయ భాషల్లోకి అనువాదమయాయి. "రష్యా విప్లవ ప్రతిబింబము"ని లెనిన్ వర్ణించిన టాల్‌స్టాయ్‌ని మహాత్మాగాంధి ఎంతో గౌరవించేవారు.

మాక్సిమ్ గోర్కీ ప్రతిభను గమనించిన ప్రముఖ భారతీయుల్లో ప్రథములు గాంధీజీయేనేమో.

1905వ సంవత్సరంలో "ఇండియన్ ఒపీనియన్" అనే పత్రికలో గోర్కిని గురించి ఒక వ్యాసంరాస్తూ, మానవ హక్కులకోసం పోరాడే మహా

యోధుడుగా గాంధీజీ ఆయనను ప్రశంసించారు. గాంధీజీ ఇంకా ఇలా రాశారు : "....కొన్నాళ్ళకిందట రష్యాలో తిరుగుబాటు జరిగింది. అందులో పాల్గొన్న ముఖ్యుల్లో గోర్కీ ఒకరు. ఆయన పుట్టినదీ. పెరిగినదీ గర్భదారిద్ర్యంలో. ఒక చెప్పులకుట్టే వానిదగ్గర పని నేర్చుకునే కుర్రవాడుగా ఆయన తన జీవితం ప్రారంభించారు. కాని, కొద్దిరోజుల్లోనే ఆయన కక్కడ ఉద్వాసన జరిగింది. ఆ తరువాత ఆయన సైన్యంలో చేరారు. సైన్యంలో ఉండగా ఆయనకు చదువుమీద ఆసక్తి కలిగింది. 1892 లో ఆయన తన మొట్టమొదటి పుస్తకం రాశారు. అది ఎంత ఆసక్తిదాయకంగా ఉందంటే, ఆయన వెంటనే ప్రజాభిమానం చూరగొన్నారు. ఆయన రచనలను కొనసాగించారు. తమ హక్కులకోసం పోరాడేందుకు సర్వ సన్నద్ధంగా ఉండేలాగా ప్రజలను అప్రమత్తులను చేయడమే ఆయనకు కావలసింది ఆయనకు డబ్బు విషయం పట్టింపేలేదు ఆయన రచనలు మహాతీవ్రంగా ఉండేవి, అందువల్ల అధికారులు జాగ్రత్తపడ నారంభించారు. ప్రజలకు సేవచేస్తూ ఆయన కూడా జైలుకు వెళ్ళవలసి వచ్చింది, ఆయన జైలును గౌరవప్రదమైన ప్రదేశంగా పరిగణించారు. మక్సీమ్ గోర్కీ లాగా ప్రజల హక్కుల కోసం పోరాడిన రచయిత యూరప్‌లో మరెవ్వరూ లేరని అంటారు."

అగ్రవలస దేశమైన రష్యా జాతీయ జీవితంలో ఒక కొత్త వీరోచిత శకాన్ని గోర్కీ రచనలు వ్యక్తీకరిస్తున్నాయి. అణగారిన ప్రజానీకం ఆశయాలనూ, వాంఛలనూ, వారికి గల అవకాశాలనూ అత్యంత వాస్తవికతతో అవి ప్రతిబింబిస్తున్నాయి, ఒక్క సోవియట్ దేశంలోనే కాక, ప్రపంచమంతటా కూడా పాఠకలోకం అభిమానాన్ని గోర్కీ అంతగా చూరగొనడానికి ఇదే ప్రధానం కారణం ఆయన సృష్టించిన పాత్రలు వలస భారతదేశ ప్రజలకు ప్రియతములు కావడానికి, ప్రత్యేకంగా, ఆయన రచనల్లోని ఈ గుణమే కారణం, ఆ పాత్రల్లో వారు సోదర బాధితులను చూచారు,

తన సొంత జీవిత పరిస్థితుల కారణంగా గోర్కీ, తన ప్రజల దారిద్ర్యానికీ, బాధలకూ సాక్షి. వాటిలో భాగస్వామీ అయ్యారు. సామాజిక న్యాయంకోసం ఆయన సాగించిన నిర్విరామ అన్వేషణ, ప్రజల అగ్రశ్రేణి అయిన అభివృద్ధి కాముక విప్లవ మేధావుల్లో ఆయనకు స్థానం చేకూర్చింది.

ఆయన తొలి రచనలు కాల్పనికవాదంతో కూడినవి. అయినప్పటికీ రష్యన్ జాతీయ జీవితంలో ఒక నవశకారంభాన్ని అవి, తమకు తోచిన రీతిలోనే ప్రతిబింబించాయి. రష్యాలో రానున్న ఉప్పెన తీవ్రతను చిత్రించేందుకు ప్రయత్నించిన రష్యన్ రచయితల్లో ఆయన ప్రథముడు. భారతీయ విప్లవ మేధావులు ఆయనను వెనువెంటనే శ్లాఘించడానికి ప్రధాన కారణం ఇదే. రష్యాలో వస్తూన్న పరిణామంవంటిదే భారతదేశంలో కూడా ఆవిష్కృతమవుతూన్నదని వీరు గ్రహించారు.

మూడవ దశాబ్దిలో వెలువడిన హిందీ, ఉర్దూ, బెంగాలీ పత్రికలు గోర్కీ చిన్న కథలను ప్రచురించ నారంభించాయి. తక్కిన భారతీయ భాషా పత్రికలేమీ వెనుకబడలేదు, భారతీయ సాహిత్య రంగంలో అభ్యుదయ ఉద్యమం పెంపొందడంతో, గోర్కీ పట్లా, తక్కిన రష్యన్ రచయితల పట్లా ఆసక్తి బ్రహ్మాండంగా పెరిగింది. అనువాదాలు త్వరత్వరగా వెలువడ నారంభించాయి. పూర్తిగా రష్యన్ రచయితల రచనలతో హిందీ, ఉర్దూ పత్రికలు చిన్న కథల ప్రత్యేక సంచికలను కూడా ప్రచురించాయి.

భారతీయ భాషలలోకి అనువాదమయిన గోర్కీ ముఖ్య రచనల్లో మొట్ట మొదటిది "అమ్మ", అది ఇప్పుడు భారతీయ భాషలన్నిటిలోనూ లభ్యమవుతూంది, దీని ఇంగ్లీషు అనువాదం మొట్టమొదట 1917లో వెలువడింది, 1921లో అది పునర్ముద్రితమయింది. ఆయన తొలి నవలలు "ఫోమా గోర్దేయెవ్" (1899), "ఆ ముగ్గురు"(1901)కన్నా భిన్నమైన ధోరణిలో 'అమ్మ' నడిచింది, కాల్పనిక వీరుడు. వర్తమాన వ్యవస్థనూ, సామాజిక అన్యాయాలనూ ఖండించేవ్యక్తిత్వాలు గా భారతీయ ... ఆ తొలి రచనల్లో ఇంకా కనిపిస్తాడు, వ్యక్తికీ, సమాజానికీ మధ్య కొత్త తరహా సంబంధాలు రూపొందడాన్ని భారతీయ పాఠకులు 'అమ్మ'లో దర్శించారు, సమాజం యొక్క ఉమ్మడి ఆశయాలు వ్యక్తి ఆత్మను అలముకొని, వ్యక్తిగతమైన విలువను ఎలా సంతరించుకుంటాయో 'అమ్మ', సందేహాలకు తావులేకుండానూ, మనస్తత్వ చిత్రీకరణలో గొప్ప నైపుణ్యంతోనూ చిత్రించింది "అమ్మ" సామాజిక పోరాటం యొక్క మహా కావ్యం మాత్రమే కాదనీ, పీడిత

ప్రజల చారిత్రక వ్యవర్తనను చిత్రీకరిస్తూ, "మానవజాతి అంతటికీ చెందిన ఒక నూతన మానవుని" చైతన్య ప్రబోధానికి సంబంధించిన ఒక పత్రమనీ వారు వెంటనే గుర్తించారు

శైలిలో మార్గదర్శకుడైన పాండేయ బచన్ శర్మ ఉగ్రతో సహా చాలమంది హిందీ రచయితలను గోర్కీ ఉత్తేజపరిచారు, "మానవుడు" అన్న తన కథలో ఉగ్ర, గోర్కీ "అమ్మ"కు ప్రతి రూపాన్ని సృష్టించారు, భారతీయ విప్లవకారుని వీరమాతను గురించి కథ అది నాలుగవ దశాబ్దిలోనూ, అయిదవ దశాబ్ది ఆరంభంలోనూ రచయితలకు అమ్మ, శ్రామికుడు, లేదా కార్మిక నాయకుడు అభిమాన పాత్రమయిన వస్తువులయారు.

గోర్కీ "అమ్మ"లోని మే దినోత్సవ ఘట్టాన్ని, కలకత్తా "లిటిల్ థియేటర్" సంస్థకు చెందిన ఉత్పల్‌దత్, బెంగాలీ భాషలో నాటికగా రూపొందించారు. ఆరవ దశాబ్ది ప్రారంభంలో దానిని ప్రదర్శించారు. ఢిల్లీలో కూడా ఆ నాటకం ప్రదర్శించారు. ఆ తరువాత బెంగాలి నాటక, సినీ రంగాల్లో సుప్రసిద్ధ నటీమణి శ్రీమతి మొలినాదేవి "అమ్మ" నవలను ఆధారం చేసుకొని ఒక నాటకాన్ని ప్రదర్శించారు. ప్రధాన పాత్రను ఆమే ధరించారు.

రవీంద్రనాథ టాగూర్. శరత్ చంద్ర ఛటర్జీ లిద్దరూ కూడా, మహాశక్తి వంతుడైన రచయితగా గోర్కీని ఎంతగానో గౌరవించారు. "పథేర్ ధాబీ" రచనలో శరత్‌బాబు మీద "అమ్మ" ప్రధానం ఉందనిపిస్తుంది. హిందీ రచయిత ఇలా చంద్రజోషీతో ఒక సంభాషణలో శరత్‌బాబు ఇలా అన్నారు.

"....గోర్కీ రచనలు చదివిన తరువాత. మానవ జీవితాన్ని గురించి వాటిలో కనిపించే సునిశిత వివేచన, తక్కిన రచయితల్లో కనబడదని అనిపిస్తుంది." "ఒక నాటి మానవులు" అన్న గోర్కీ కథను (దీని బెంగాలీ అనువాదం 1922లోనే వెలువడింది) చదవవలసిందిగా జోషీతో చెప్పి, శరత్‌బాబు ఇంకా ఇలా అన్నారు, "పూర్తిగా కొత్తవయిన దృక్పథమూ. భావాలూ, శైలీ. పద్ధతీ మీకు కనిపిస్తాయి. మానవ జాతికి గోర్కీ ఒక కొత్త సందేశం ఇచ్చారు. ఆయన

రచనలను చదవకపోతే. జీవితానికి సంబంధించిన అతి ముఖ్యమైన అంశాల్ని గురించిన పరిజ్ఞానం లేకుండా చేసుకోవడమే అవుతుంది."

శ్రీ క్రొవ్విడిలింగరాజు ''అమ్మ"ను తెలుగులోకి అనువదించారు. ఆ అనువాదం 1931లో వెలువడింది, బ్రిటిష్ పాలకులు దానిని వెంటనే నిషేధించారు. పత్రికలూ. పాఠకలోకమూ దానిని ఎంతో ప్రశంసించారు. కాని, దాని ప్రచారం రహస్యంగానే జరగవలసి వచింది. మద్రాసు రాష్ట్రంలో ఏర్పడిన తొలి కాంగ్రెస్ ప్రభుత్వం 1939లో ఈ నిషేధాన్ని రద్దు చేసింది. ఆ తరువాత అది ఎనిమిది ముద్రణలు పొందింది. పాఠకలోకంలో దానిపట్ల అపారమైన అభిమానం ఉంది. శ్రీ పడాల రామారావు కూడా ఇటీవల "అమ్మ"ను తెలుగులో అనువదించారు.

ఐదవ దశాబ్ది ప్రారంభంలో "అమ్మ"ను శ్రీ పా రామస్వామి "అన్నై" అన్న పేరుతో తమిళంలోకి అనువదించారు. ఆ తరువాత శ్రీ టి. యం. చిదంబర రఘునాధన్ యొక్క తమిళ అనువాదం 1952లో వెలువడింది.

శ్రీ పి. జె. మాథ్యు, "అమ్మ"ను మలయాళంలోకి మొదటిసారిగా అనువదించారు, ఆ అనువాదం 1947 లో వెలువడింది; మాథ్యు ల్యూక్ దానిని మరొకసారిగా మలయళంలో అనువదించి, 1954 లో ప్రచురించారు,

....❀....

నా ఉద్దేశంలో మనిషి ఎప్పుడూ విజయుడే తనను, ప్రకృతిని అర్థం చేసుకోవడంలో అతని శక్తి శ్లాఘించదగింది అతని బతుకు ఎంతో దుర్భరమైనా, ఇంకా తన హద్దుల్ని పెంచుకుంటూనే ఉన్నాడు, మనిష స్రుష్టికర్త, అమోఘమైన శ్రమజీవి.

-గోర్కీ-




# తుఫాను పక్షి పాట

— గోర్కీ

తెల్లని సముద్రంపై తుఫాను మేఘాలను ప్రోగుచేస్తున్న గాలులు –

సముద్రం - మేఘాల మధ్య మెరుపుతీగలాగా స్వేచ్ఛా విహారంచేస్తున్న తుఫాను పక్షి –

పక్షిరెక్కను ముద్దాడుతున్న అల –

ఉత్సాహం ఉరకలు వేస్తుండగా బాణంలా పైకెగసి పోతున్న పక్షి – మబ్బులతో ముచ్చటలాడి భయంకరంగా కూతకూస్తున్న పక్షి – పక్షి సాహసోపేతమైన కూతకు వివశలై, ముచ్చటపడుతున్న కారు మేఘాలు –

కూతలో తుఫాను కొరకు ప్రతిధ్వనిస్తున్న ఆరాటం – కోపం, తాపం, విజయంపై విశ్వాసం ధ్వనిస్తున్న తుఫాను పక్షి పాట, భయంతో మూలుగుతున్న పొడవైన రెక్కలు గల నీటి పక్షులు – బాణాల్లా సముద్రం లోనికి – యింకా లోపలకి – సముద్రం చీకటి లోతుల్లోకి పోయి భయ విముక్తిని పొందజూస్తున్న నీటిపక్షులు–

పిడుగుపాటును తలచుకొని గజగజ వణికే నీటిపై యీదే మరొక రకం పక్షులు –

కొండరాళ్ళ రంధ్రాల్లో దాక్కొంటున్న వేరొక రకం నీటి పక్షులు –

ఉవ్వెత్తుగా లేస్తున్న అలల నురుగులపై సగర్వంగా విహరిస్తున్న తుఫాను పక్షి –

దగ్గరై చిక్కబడి ఘనీభవించి క్రిందికి– ఇంకా క్రిందికి దిగి సముద్రంలో కూరుకు పోతున్న కారు మేఘాలు –

ఉరుములతో కలవాలనే ఉత్సుకతతో, హోరుతో పైకి – పైపైకి ఎగుస్తున్న సముద్ర కెరటాలు –

అంతలో పిడుగుపాటు–

---

అనువాదం: కొవ్మారెడ్డి కేశవరెడ్డి

భయంకరంగా తుఫాను గాలులతో పోయసాగిస్తున్న సముద్రజలాలు—

కోపంతో రెచ్చిపోయిన గాలులు, సముద్రజలాలను బిగి కౌగిళ్ళలో బంధించి, పర్వతసానువులకేసి విసరికొట్టగా, జలజల రాలుతున్న ముత్యాలు —

తుఫాను మేఘాల గుండెల్లో గ్రుచ్చుకొని, చీలుస్తూ సముద్రాజలాలను వేగంగా కోస్తూ, మెరుపుతీగలా విహరిస్తున్న తుఫాను పక్షి —

నవ్వు — తుఫాను మేఘాలను చూచి,

సిట్టూర్పు —ఆలోచన తీవ్రతతో.

పిడుగు పాటుతో శక్తి క్షీణింపగా చేసే పణుగుడును వింటున్న తెలివైన రాకాసి తుఫాను పక్షి -

అనతికాలంలో తుఫాను సద్దుమణుగుతుందని దేదీప్యంగా సూర్యుడు ప్రకాశిస్తాడని తెలిపిన తుఫాను పక్షి -

అవును; సూర్యుడు దేదీప్యంగా ప్రకాశిస్తాడు.

హోరుతో గర్జిస్తున్న సముద్ర జలాలు —

పిడుగుపాటు—

ఉప్పొంగుతున్న సముద్రంపై క్రమ్ముకుని, ఘనీభవించిన తుఫాను కారుమేఘాలలో భగ్గున రగులోకొన్న అగ్ని -

అగ్ని రవ్వలను బంధించి ఆర్పివేస్తున్న సముద్ర జలాలు —

వంకర్లు తిరుగుతూ. సముద్రపు లోతుల్లో అదృశ్యమవుతున్న అగ్గిరవ్వల ప్రతిబింబాలు -

తుఫాను - చెలరేగుతున్న తుఫాను,

గర్జిస్తూ, ఉప్పొంగుతున్న సముద్రంపై మెరుపుల తళతళలతో, సగర్వంగా యింకా పాడుతూ విహరిస్తున్న తుఫాను పక్షి -

విజయంపై విశ్వాసం ధ్వనిస్తుంది తుఫాను పక్షి పాటలో —

తుఫాను విజృంభించాలి.

తుఫానుకు స్వాగతం.






# మక్సిమ్ గోర్కీ మనకర దీపం

— సోమసుందర్

గోర్కీ బాల్యం భయంకర జార్ పాలనలో గడిచింది. రష్యన్ ప్రజా జీవితం పరమ దుర్భరంగా సాగుతున్న రోజులవి. పరిసరాలు దుర్గంధభూయిష్టంగా రోత కలిగించేవి. పేదల వాడలు మరీ కశ్మల కాలుష్యాలతో నిండి నీచంగా ఉండేవి. ఏ విధంగా చూసినా బ్రతుకు చావుకు పర్యాయపదంలా మారి పోయింది. నదీ జలాలు కుళ్ళు కాలువలతోనూ, నగరం విసర్జించిన మురికి తోనూ కులకులలాడేది :

అట్టి దుష్ట వ్యవస్థలో గోర్కీ చదువు అరకొరగా సాగింది. ఐనా పట్టు దలతో, స్వయంకృషితో జ్ఞానం సముపార్జించాడు. ఏదయినా ఒక పుస్తకం సంపాదించగలిగితే పెన్నిధి లభించినంత ఆనందం కలిగేది గోర్కీకి. ఆ పుస్తకాల ద్వారా ఒక దివ్య సుందర లోకాన్ని సందర్శించగలిగేవాడు. యధార్థ ప్రపంచం కన్న - గ్రంథ గత ప్రపంచమే ఎంతో హాయి గొలిపేది. నిరంతర వాంఛనీయంగా తోచేది. ఎంతో ఆకర్షవంతంగానూ, ఆశావహంగానూ స్ఫురించేది. గ్రంథ పఠనం కోసమేనా బ్రతకాల్సిందేనన్న సత్సంకల్పం కలిగేది :

అందుకే అతని స్వీయ చరిత్ర అంతేనే - గ్రంధాన్వేషణా దీక్షగా రూపొందింది. గ్రంధ పఠనమే ప్రధాన మానసిక వ్యాపకంగా మారింది. ఒక ప్రక్క ఆకలి బాధ; మరో ప్రక్క తలదాచుకుందుకు వెదుకులాట! ఆకలి తీర్చుకుందుకు వడుం విరిగేటట్లు చాకిరీ. ఆ శ్రమకయినా ఒక పద్ధతీ ఒక క్రమమూ ఉండేది కాదు. ఆలాంటి పరిస్థితుల్లో గోర్కీ - గ్రంథాశ్రయంతోనే మానసిక ఆరోగ్యం కాపాడుకున్నారు.

వయోభేదం లేకుండా ఆరోజుల్లో గోర్కీకి ఎందరో మిత్రులు దొరికారు. కొందరు తెలివిడి తలుపులూ తెరిచారు. ఒక వృద్ధకెమిస్టు వుండేవాడు. స్ఫటికాల వంటి దళసరి కళ్ళద్దాలలోంచి చురుకు చూపులు చూస్తూ - ప్రతిమాటా నొక్కి నొక్కి పలికేవాడు. అతనిమాటలు తన తలలో మేకులు కొటిస్తున్నట్లుండేవట! అందుకే గోర్కీ జీవితాంతమూ అతని మాటలు మరచి పోలేదు!

"భాష ఒక చెట్టు వంటిది. పదాలు దాని ఆకుల్లాంటివి, ఆ ఆకులు ఆలా ఎందుకు ఉన్నాయి! మరో ఆకారంలో ఎందుకు లేవు? ఈ ప్రశ్నలకు జవాబు తెలుసుకోదలిస్తే - ఆ చెట్టు పుట్టుపూర్వోత్తరాలే తెలుసుకోవాలి! అందుకే గ్రంథాలు చదవాలి. ప్రతీ పుస్తకం చక్కని తోట వంటిది సుమీ నేస్తం! ఆ తోటలో ఎన్నో మనోజ్ఞ వృక్షాలుంటాయి, ఆకలి దప్పి తీర్చే ఫల వృక్షాలూ ఉంటాయి, జ్ఞానం బోధించే చెట్లూ ఉంటాయి" అన్నాడట ఆ కెమిస్టు.

ఇంత మంచి మాటలెలా మరచి పోతాడు గోర్కీ? ఆ కెమిస్టు దగ్గరికి తరచుగా వెళ్ళేవాడు. అతని సంగ్రహ బోధలవల్ల తనకు గ్రంథాల గురించి ఎంతో యిష్టం ఏర్పడిందని చెప్పుతున్నాడు. పుస్తకాలు తనకు బలవర్ధక మాద కత్వం కలిగించే వన్నాడు. జీవిత ప్రయోజనాన్ని పుస్తకాలే తనకు కలిగించాయి. ఉత్కృష్ట వాంఛలలో, ఉద్వేగపూరిత భావాలతో, బ్రతికే మనుషుల్ని ప్రదర్శించాయి. సాహసుల జీవన హాసాలనూ ప్రతిబింబించాయి. నేరమే బ్రతుకు ధ్యేయంగా మార్చుతున్న విర్భాగ్యుల్నీ చూపించాయి. తన చుట్టు ప్రక్కల బ్రతికే కొందరు నేరాలు చేయడానికే ఎందుకింత ఆరాటపడతారో - పుస్తకాల వల్లనే గోర్కీ అర్థం చేసుకోగలిగాడు. వాళ్ళు బొత్తిగా పుస్తకాలు చదవరు. అందుకే వాళ్ళలా తయారయ్యారనిపించేదతనికి! ఏమయినా వాళ్ల బ్రతుకుతున్న రీతి మాత్రం వాంఛనీయం కాదు. దాన్ని మార్చి తీరాలని గోర్కీకి అనాడే ఒక విశ్చయం కలిగింది,

లండన్, పారిస్, ప్రేగ్ మహా నగరాల దృశ్యాల చిత్రాలతో నిండిన పుస్తకాలు - ఆ వయసులోనే గోర్కీకి లభించాయి, ఆ బొమ్మలు చూస్తూ ఎంతగా మురిసిపోయేవాడో! తాను చూసిన రష్యన్ నగరాలన్నీ మురికి కూపాలే!

ఎక్కడ పడితే అక్కడల్లా అభ్రభత గూడు కట్టుకునేది. కాని ఈ చిత్రాలలో కనిపించే ఆరు మహా నగరాలు కల్మషరహితంగా కనిపించాయి. కడిగిన ముత్యాల్లా మెరిసి పోతున్నాయి! ఆ దృశ్యాలన్నీ మధుర స్వప్నాలుగా మారి - నిద్ర మడతల్లో అతని పసిగుండెల్ని హాయిగా నిమిరేది; తన ఎదురుగా వున్న వాస్తవ పరిస్థితుల్ని పుస్తకాల్లో వర్ణితమయిన మనోజ్ఞ జీవితంలో పోల్చి చూసుకొనే అవకాశం అప్పుడే లభించింది గోర్కీకి; దానితో వాస్తవ జీవితం మరింత కురూపిగా కనిపించేది. ఎంతో వికారిగా తోచేది.

గ్రంథ పఠనమే లేకపోతే - ఆ పరిసరాల కాలుష్యం వల్ల తన ఆరోగ్యం పూర్తిగా చెడిపోయేదని గోర్కీ భావించేవాడు. మంచి ఆహారం లభించకపోయినా గ్రంథ పఠనంవల్లనే తనకు ఎంతో బలమూ పుష్టి కలుగుతున్నట్లు భ్రమించేవాడు. పని చేయడానికెంతో పట్టుదల కలిగేది. సంకల్ప బలమూ పెంపెనలాడేది. గ్రంధపఠనం వల్లనే తన కొక లక్ష్యశుద్ధి ఏర్పడినట్లు కూడా గోర్కీ కంఠోక్తిగా చెప్పుతున్నాడు. ఎంత చప్పునా పని ముగిస్తే — అంత ఎక్కువ సమయం గ్రంథ పఠనానికి ఆదా అవుతుందని భావించేవాడు, గ్రంథాశ్రయం లభించగానే బాధలన్నీ మరచిపోవచ్చునని అతని మనసు వెంపెర్లాడేది.

ఎప్పుడయినా ఏదయినా దురదృష్టం - తన చేతిలోని పుస్తకం లాగేసుకుంటే మాత్రం గోర్కీ గుండె గుబగుబ లాడేది! ఎంతో విసుగూ అలసటా కలిగేవి.

ఒక విషాద సంఘటనకు ముదరాగా గొప్ప రచయితల గ్రంథాలు చదివే అవకాశం గోర్కీకి లభించింది. దొరికే మహత్తర గ్రంథాలన్నీ ఏమాత్రం కాల హరణం చేయకుండా. ఆపురావురు మంటూ ఆలుగా చదివేశాడు. ఎంతో ఆనందంతో తేలిపోయాడు. జరిగిన విషాద సంఘటన తనకు కలిగించిన శారీరక బాధలన్నీమటుమాయమైనట్లు తోచిందతనికి ఒక అసాధారణ జీవితంలో తానొక అంతర్భాగమైనట్లు గొప్ప తృప్తి కలిగింది.

ఆ అనుభూతిని గోర్కీ బ్రతుకుపోదుగునా భద్రపరచు కొన్నాడు. గ్రంథ గతాంశాల వల్ల ఒక తీయని వేదన అతని హృదయాన్ని మలివెట్టేది. ఐన ఆవేదన

ఉల్లాసమే కలిగించేది. ఆ సంవేదనే తిరిగితిరిగి లభించాలన్న ఆ కాంక్షే గోర్కీని గ్రంథోప జీవిగా మార్చింది.

సొంతంగా తయారు చేసుకున్న లాంతరు వెలుతురులో పుస్తకం పెట్టుకొని. చదువుకుంటూ కూర్చుంటే — చుట్టూ క్రమ్ముతున్న దట్టమైన చీకటి నీడలు పటాపంచాలవుతున్నట్లు - ఒక ధైర్యం కలిగేది. కాని ఆ చీకటి నీడలు మాత్రం తొందరగానే ఆ లాంతరును చుట్టుముట్టేవి. మళ్ళీ మసితుడుచుకొని. చేతులు తుడుచుకొని, ఆ సగం వెలుగులోనే రాత్రి తెల్లవార్లూ పుస్తక పఠనంలో గడిపేవాడు గోర్కీ!

తెల్లారే సరికి కళ్ళు వాచిపోయేవి. చూపరులకు అదేమైనా రోగమేమోనని పించేది. అతనలా చదువుతూంటే - పెద్ద యజమానురాలు ఈర్ష్య పడేది. "ఒరేయ్! పుస్తకాల పురుగూ, అలాగే చదువుతూ వుండు. ఎప్పుడో ఒకనాడు నీ కనుగుడ్లు పేలిపోతాయి! " అని శాపాలు పెట్టేది.

కాని ఈ పిల్ల శాపాలు మేధావరంగా గోర్కీ విశ్వరూప సాక్షాత్కారానికి మేలే అయ్యాయి!

గోర్కీ చదువుతున్న గ్రంథాలలో ఎన్నెన్నో చిక్కులెదురయ్యేవి. కథా క్రమాలికలు అర్థమైన మలుపులూ తిరిగేవి. ఆ పుస్తకాలన్నీ ఒకదేశానికి చెందినవి కావు. ఒక కాలవిధికి సంబంధించినవీ కావు. ఒకే ప్రాదేశిక జీవితాన్ని వర్ణించినవీ కావు, ఆ గ్రంథాలలో వర్ణితమైన విషయాలు ఎంతో వైవిధ్య భరితంగా సాగేవి. కాన్ని అన్ని గ్రంథాలలోనూ ఒకే మహా మానవమూర్తి గోర్కీకి దర్శనమిచ్చేవాడు.

పుస్తకాలలోని మంచి మనుషులు ఎప్పుడూ ఎన్నో కష్టాలు పడుతూంటారు, చెడ్డవారు నిత్యం ఎన్నో అత్యాచారాలూ పాపాలూ చేస్తూంటారు; కాని సుఖంగా బ్రతికేస్తూ ఉంటారు! ఈ జీవితంలో కష్టాలను భరించిన వారికి, ప్రభువు స్వర్గ లోకసుఖాలు ప్రసాదిస్తారని చెప్పే బైబిలు బోధలు అబద్ధాలేమోనని అనాడే తోచింది గోర్కీకి!

తాను చదువు తున్న గ్రంథాలలో చిత్రం- ఏదో [illegible]శక్తి - దుష్ట మనుషు లందరికీ చివరికి ఓటమే కలిగించేది. కష్టాల పాలయిన మంచి మనుషులకే చివర విజయాలు లభించేవి. ఇది నిజమో కాదోగాని - గోర్కీకి మాత్రం ఒక ఆశావాదాన్ని సందేశించేవా గ్రంథాలు.

తొలిపుట చదివీ చదవగానే, పరిచయమైన ఆ పాత్రలు చివరి కేవిధమైన మలుపులు తిరుగుతాయో గోర్కీ ఊహించుకొనేవాడు. తానుగా ఒక కథా ప్రణాళిక సిద్ధపరచు కొనేవాడు. ముఖ్యంగా, చదువు కట్టిపెట్టి బ్రతుకుపాట్లు పడవలసిన సమయాలలో అతని మనసు తప్పకుండా పుస్తకాలలోని విషయాలనే మననం చేసుకొనేది. తనలో తానే చర్చించుకొనేవాడు గోర్కీ. తన ఊహలననుసరించి-కథాగమనంలో ఎదురయ్యే సొటముళ్ళు విప్పడానికీ ప్రయత్నించేవాడు. గ్రంథగత సమస్యలకు తానే పరిష్కార మార్గాలు అన్వేషించేవారు.

తానూహించినట్లు ఏఏపాత్రలు స్వర్గలోకాన్ని చేరుకుంటాయో. ఏఏదుష్ట పాత్రలు నరక కూపంలో కూలిపోతాయో గోర్కీ సక్రమంగా ఊహించ గలిగే వాడు-ఈ అరుదైన అభ్యాసం వల్లనే-గోర్కీ గొప్ప కథా రచయితగా, నవలా కారునిగా, నాటక రచయితగా రూపొందాడనిపిస్తుంది.

ఈ గ్రంథ పఠనాభ్యాసమంతా- 12-16 ఏళ్ళ నడుమ సాగినదే! మహత్తర అనుభవాలార్జించుకుందుకు రాచబాటలా వయస్సులోనే వేసుకున్నాడు, 18ఏళ్ళ నాటికే, తొలి కథ "మకార్ ఛంద్రా" ప్రచురించాడు. అతనకు లభించిన తొలికీర్తి -మహత్తర సాహిత్య సౌధానికి ప్రథమ సోపానమైంది. అదే గోర్కీని అజరామర విశిష్ట రచయితగా ప్రతిష్ఠి చ గలిగింది!

(ఈ మార్చి 28 తేది - మక్సిమ్ గోర్కీ 120 జయంతి సందర్భంగాని వాళులర్పిస్తూ.... ఈ వ్యాస రచనకు ఆధారం గోర్కీ స్వీయ చరిత్రలో - My apprenticeshi.p అనే గ్రంథం....)

❀

వ్యాసం

# గోర్కీ సోషలిస్టు మానవతావాదం

—ఎవ్‌గెనీ క్నిపోవిచ్

**1927**లో అక్టోబరు సోషలిస్టు విప్లవ దశమ వార్షికోత్సవ సందర్భంలో అలెగ్జీ మాక్సిమొవిచ్ ఒక వ్యాసం రాశారు. "నిజంగా ఒక కొత్త ప్రపంచాన్ని" సృష్టించినట్టి, "లోకానికి అత్యావశ్యకమైనట్టి" రష్యన్ నవమానవునికి సాహార్ద్రాభి నందనలతో ఆయన వ్యాసం ముగించారు.

ఇవి ఒక క్యామ్రేడ్‌కు కేవలం శుభాకాంక్షలు అందజేసే మాటలే కావు. ఒక కళాకారుడూ, సోవియట్ పౌరుడూ ఆనందాన్ని వ్యక్తం చేసే మాటలే కావు. ఆ రష్యన్ పౌరుడూ, ఆ జగద్విఖ్యాత సంస్కృతీవేత్తా తన సంకల్పశక్తికీ, ఆవేశానికీ, ద్వేషానికీ తన అసమానప్రతిభావ్యుత్పత్తులకూ, రూపురేఖలు తీర్చిదిద్దిన వారికి ఆ మాటలతో అభినందనలు తెలియజేశారు. గోర్కీ తన వర్గంతోపాటు పెరిగారు. కోటానుకోట్ల "అల్పమానవుల", "తాడిత బాలుర" భవిష్యత్తూ, అనుభూతీ ఆయన రచనలలో నిక్షిప్తమై వున్నాయి. వీరంతా జారిస్టు రష్యాకూ, రష్యన్ ఆసియా పెట్టుబడిదారీ వ్యవస్థకూ సవతి పిల్లలుగా పెరిగారు. విప్లవ రహస్య కార్యకలాపాలూ, జైళ్ళూ, ప్రవాసమూ, కఠిన శిక్షలూ, ప్రపంచంలోకెల్లా మహత్తరమైన విప్లవమూ, అంతర్యుద్ధమూ, "నిజంగా ఒక కొత్త ప్రపంచాన్ని" నిర్మించడానికి విజయవంతంగా సాగిన వీరోచిత పోరాటమూ — వీటన్నిటినీ గడచి గద్దెక్కినవాళ్ళ మార్గాన్ని ఆయన తన రచనలలో చిత్రించారు.

గత వర్తమానకాల సాంస్కృతిక మహోన్నతశిఖరాలను అధిరోహించిన ఈ "నవ రష్యన్ మానవుని" సైద్ధాంతిక ధైర్యం గోర్కీ రచనలలో మూర్తీభవించింది.

రష్యన్ మహోత్తర సాంస్కృతిక సంప్రదాయ సంవాహకుడుగా, వాటికి వారసుడుగా మాత్రమే గోర్కీ గత, వర్తమాన కళాకారుల శ్రేణిలో చేరలేదు. సోవియట్ ప్రజల జగద్వ్యాప్తమయిన సోషలిస్టు సంస్కృతి ప్రథమ ప్రతినిధిగా ఆ శ్రేణిలో చేరారు.

గోర్కీ మానవతావాదం లోని కొత్త లక్షణాలను, నిజమయిన చారిత్రక దృష్టితో అవగాహన చేసుకోవాలంటే, మొదట మనం ఆయన రచయితగా రూపొందిన కాలాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవడం అవసరం. వేరు మాటల్లో చెప్పాలంటే. ఆయన ప్రజ్ఞా విశేషాలు ఒకానొక సైద్ధాంతిక, కళా వాతావరణంలో ఆవిష్కృతమయ్యాయి. అటువంటి వాతావరణం ఉండికూడా అవి వెలికి వచ్చాయి. ఆ వాతావరణ మేమిటో తెలుసుకోవడం అవసరం.

19వ శతాబ్దం ముగిసి 20 వ శతాబ్దం అడుగుపెట్టడంలో సామ్రాజ్యవాద యుగం ప్రారంభమయింది. అది 1917 ఫిబ్రవరితో ముగిసిన చారిత్రక పరిణామ దశకు నాందీ వాచకమూ, 1880 వ దశకానికి భరతవాక్యమూ, అప్పటికి సామాజిక చైతన్యంలో గొప్ప సంక్షోభం వ్యాపించింది, ఇది "విద్వత్ప మాజం" భవిష్యత్తులోనూ "రష్యన్ సామాజిక భావన భవిష్యత్తులోనూ ప్రతిబింబితమయింది" క్రమంగా బూర్జువా ఉదారభావంతో విలీనం కావడం, రష్యాలో మార్క్సిజం ఆవతరించడం, జారిస్టు రష్యా పునాదులను కదల్చిన భూకంపన మంద్రధ్వనులు — ఇవన్నీ ఆ కాల స్వభావ చిహ్నాలు.

గోర్కీ తన రచనలలో సమకాలీన సమాజంలో వచ్చిన చీలికను ఏకరీతిగా చిత్రించారు. ఆయనది రష్యన్ కార్మికుని కంఠం, రష్యన్ శ్రామికవర్గ కంఠం, శ్రమజీవుల కంఠం, వారు పాత ప్రపంచాన్ని సహించే స్థితిలోలేరు. శాంతికోసం, నిజమయిన శాంతికోసం, తమ శ్రమజనితమయిన విలువలన్నింటికీ తమకున్న హక్కు కోసం పోరాడటానికి సిద్ధమయ్యారు.

గోర్కీ కాల్పనికవాది, అయితే, ఆయన కాల్పనికవాదం 'ప్రపంచంపై భ్రమలు తొలగడంవల్లా, లేదా ప్రపంచాన్ని నిరాకరించడంవల్లా" ప్రాదుర్భవించింది

కాదు. ఒక మహాధినేత కరస్పర్శకోసం వేచిఉన్న జీనత్ ప్రపంచంస్థానే ఊహా కల్పిత ప్రపంచాన్ని, "ఒక గాయకుని ఉన్మాదవిచేష్ట" సృష్టించిన ప్రపంచాన్ని నెలకొల్పాలనే వాంఛవల్ల పుట్టిందికూడ కాదు. ఇలాంటి కాల్పనికవాదాన్ని ఆయన మరో రకమయిన కాల్పనిక వాదంతో ఎదుర్కొన్నారు. "ప్రపంచంతో తనకుగల దృఢానుబంధాలను గుర్తించడంవల్లా, అది తనలో రేకెత్తించిన సృజనశక్తిని గుర్తించిన ఎరుక" వల్లా ఈ కాల్పనికవాదం ఉద్భవించింది. ఈ ఫక్కీ ఇప్పు డిప్పుడే తల ఎత్తుతోంది. ఇప్పుడిప్పుడే రూపుగొంటూంది, పెట్టుబడిదారీ శృంఖలాలనుండి యావత్ మానవజాతిని విముక్తి చేయాలనే సోషలిస్టు భావనకు వాహికగా, మహత్తరమయిన సౌహార్ద స్వేచ్ఛాయుత శ్రమభావనకు, సోషలిస్టు వ్యవస్థా భావనకు వాహికగా జీవితంలో అడుగు పెడుతున్న వర్గంలో ఇది స్థావం సంపాదించుకొంటూ వుండటం మనం చూస్తున్నాము" అన్నారు, గోర్కీ.

గోర్కీ శ్రామిక విప్లవ మానవతావాదం సమకాలీన పాశ్చాత్య ఉత్తమ సంస్కృతీ వేత్తల మానవతావాదాన్ని తిరస్కరించడంలేదు. మాయోపాయాలు మోసం మొదలగువాటి సహాయం లేకుండా పోరాడి విజయం సాధించిన ఏకైక వర్గానికి సహజమయిన చిత్తశుద్ధితో, నిర్దాక్షిణ్యంతో శ్రామికవర్గం గోర్కీ ద్వారా, పాశ్చాత్య కళాకారులకు, ఉన్న ఒకేఒక సరియైన మార్గాన్ని చూపింది. సంకుచిత మనస్తత్వం. నిర్వీర్యత, భయం ధరించిన మేలిముసుగుల్ని లాగివేసి. వాటి నిజస్వరూపాన్ని బహిర్గతం చేసింది.

కారుణ్య ప్రధానమయిన మానవతావాదానికి, సత్యప్రధానమయిన మానవతా వాదాన్ని గోర్కీ ఎదుర్కొన్నారు. ఎందుకంటే సత్యం "కారుణ్యంకన్న గొప్పది" మానవుని పట్ల "మృదులమైన కృపాకారభావం" అనే పైఅరికి మానవునిపట్ల నిస్తులమైన గౌరవతాభావాన్ని ఎదురొడ్డారు, ఒంటి స్తంభం మేడలో కూర్చున్న "విశిష్ట వ్యక్తి" ఆరాధనకు, సకలసాంస్కృతిక విలువలను సృష్టించే అసంఖ్యాక ప్రజానీక సంకీర్తనను ఎదురొడ్డారు. అజాగ్రత్తవిత సృష్టి రూపొందించే అద్భుత మయిన ఒక ఊహాకల్పిత మహాపురుషునికి తన వర్గంలో విప్లవ పోరాటాలలో వీరుడుగా మహాపురుషుడుగా రూపొందే మొనగాణ్ణి ఎదురొడ్డారు, కళాకారునికి

ప్రపంచానికి మధ్య సంబంధాలను గురించి గోర్కీ నిరంతరం గట్టిగా నొక్కి చెప్పేవారు వాస్తవ విరుద్ధమయిన కళా ప్రపంచాల సారం నేతి బీరకాయలోని నేతి వంటిదని నొక్కి చెప్పేవారు. మానవజాతి అనంతకోటి స్వరూపాలు ఎంత మహత్తరమైనవో, ఎంత సృజనాత్మకమయినవో, మానవజాతి హక్కులూ మార్గాలూ ఏవో, ఆయన, లోకాతీత మానవుని గూర్చి వాదించేవారికి ఎంతో ఆవేశంతో, పట్టుదలతో వివరించారు.

దుర్బలులను అవమానించాలనే కోర్కె, పెత్తనం చలాయించడంలో ఆనందానుభూతిపొందే అల్పత్వం, తాగి తందనాలాడటం, పోట్లాటలు, క్రూరమైన "హాస్యాలు". సిగ్గు విడిచి ఒకరినొకరు తెగతిట్టుకోవడం, నిన్నా మొన్నటి వరకు మిత్రులుగా వున్నవారిని అకస్మాత్తుగా అర్థంపర్థం లేకుండా చంపడం— ఇదీ గోర్కీ తన కళ్ళతో చూచిన "భయంకరమయిన ప్రపంచం"; "విపరీత బుద్ధుల" ప్రపంచం. గోర్కీ స్వయంగా చవిచూచిన పెట్టుబడిదార్ల దుష్టసమాజంలో శ్రామికుల పరాభవానికి ఇది ఒక విధమయిన కొలమానం.

గోర్కీ చెప్పినట్లు, ఈ ప్రపంచంలో "పట్టి గుండెతో" పడుస్తూనే దాన్ని త్యజించకుండా వుండటానికీ, సజీవ సృజనశీల శక్తులు చీకాకు, మాలిన్యం, క్రౌర్యం నుండి ముందుకు తోసుకు వెళ్ళడానికి, మానవుని కసికి పరాభవానికి కారణభూతుడెవ్వడో గుర్తించడానికి ఎంతటి అపారమయిన ఆశాభావం కావాలి; మానవునిలోనూ, అతని భవిష్యత్తులోను ఎంతటి ప్రగాఢవిశ్వాసం కావాలి; ప్రపంచంతోనూ, ప్రజలతోనూ గల సంబంధాలు ఎంత దృఢంగా వుండాలి!

గోర్కీ బోల్షివిక్కు; లెనినిస్టులు, పాత ప్రపంచాన్ని ధ్వంసం చేయడానికి దాన్ని మార్చివేయడానికి గోర్కీ తన యావజ్జీవితాన్నీ శక్తిసామర్థ్యాలనూ అంకితం చేశారు.

శ్రామికులను జీవిత వాస్తవాలతో దృఢసంబంధాలున్న మహోత్కృష్ట రష్యన్ సంస్కృతి వేత్తలను, తమ ఉనికివల్లనే మానవజాతికి వన్నెతెచ్చే అద్భుత వ్యక్తులనూ గోర్కీ ఎంతో జాగ్రత్తగా, ప్రేమతో చిత్రించారు,

"క్లిమ్ శాంగిన్ జీవితం", ఫోమా గోర్దెయేవ్" మొదలగు అనేక కథల లోనూ, స్వీయచరిత్రను ప్రతిబింబించే 'ప్రపంచంలో' అన్న సుదీర్ఘమైన కథ లోనూ సమిష్టి కృషిని, మన హృదయాల్లో శాశ్వతంగా నిల్చిపోయ్యేలా చిత్రించారు. అది కొద్ది సేపే సాగినా, ఆ కృషి ఎలా మానవుని చక్కపరచి, అతనిలో నిద్రాణమైన మానవాత్మను జాగృతం చేసిందో కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. పెట్టుబడిదారీ పరిస్థితులలో సైతం సమిష్టికృషి శ్రామిక ప్రజల మహాసైన్యాన్ని రూపొందిస్తుంది. ఆత్మగౌరవం, శౌర్యం, వీరత్వం" — వీటి అనుభూతిని దాని కందిస్తుంది. సోషలిస్టు సమాజంలో పని పాటలు మనకీ అనుభూతినిస్తాయి.

వాస్తవమైన మానవతావాదానికి సంబంధించిన ఈ నిత్యలక్షణాలు పని పాటలూ, ప్రేమ, మైత్రి, కళాభిని వేశాలతో మానవుడు పరివర్తన చెందడం — వాటివల్లనే గోర్కి తనకు దృగ్గోచరమవుతున్న కంటకావృత ప్రపంచాన్ని ఉత్సాహంతో సంతోషంతో చూడగలిగారు. ఆయన జీవిత తృష్ణ నిత్యనూతనంగా కొనసాగింది.

"శత్రువులు", "సంస్కారహీనులు", "అమ్మ" —వీటిలో గోర్కి విప్లవోద్యమాన్నీ, విప్లవభావాలనూ, మానవునిలో మానవ లక్షణాలను పునరుద్ధరించే దోహదాలుగా చిత్రించారు. విప్లవాగ్ని. నిజంగా ఒక కొత్త ప్రపంచాన్ని సృష్టించడానికి జరిగే పోరాటం, మానవునిలోని అజ్ఞాన పంకిలాన్ని, అధికారంలో వున్న పెట్టుబడిదారులు ప్రజల నోళ్ళలో కుక్కిన నల్లమందునూ భస్మీపటలం చేసి అతణ్ణి శోధనంచేసింది. మానవుడు ప్రపంచాన్ని మార్చడంలో తానూ మారుతాడు, పాశ్చాత్య దేశాలలో గొప్ప మానవతావాదుల నందరినీ పట్టిపీడిస్తున్న "పాడు సమస్య"ల కన్నిటికీ గోర్కి ఇచ్చిన సమాధానమే ఆయన చిత్రించిన శ్రామికుడూ ఆయన ప్రతిపాదించిన బొల్షెవిక్ మానవతావాదమూ.

గోర్కి వృద్ధాప్యంలో ఆయనకు మిత్రులుగా సహయోధులుగా వున్నవారి తలలు ఏనాడో నెరిశాయి. సాహిత్యంలో గోర్కి వెలిగించిన జ్యోతిని దేదీప్యమానంగా ఉంచుతున్నది వారే కాదు. అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం తరువాత ప్రపంచ చరిత్రలోనూ, ప్రపంచ సంస్కృతిలోనూ ప్రారంభమయిన అప్రతిహత పరిణామక్రమంలో గోర్కి కృషి ప్రభావమూ, ఆయన ఆశయాలూ అంతర్గత భాగమయ్యాయి.

✽

# భారత రచయితలు - గోర్కీ

(భారత దేశంలోని వివిధ భాషల రచయితలు తమతమ రచనలకు గోర్కీ ఎలా ప్రేరణ అయ్యాడో వ్యక్తీకరించారు.)

నేను అపారంగా రుణపడి ఉన్నాను ప్రజా సాహిత్యానికి ఆద్యులలో గోర్కీ ఒకరు. చాల మంది భారతీయ రచయితలకు ఆయన మార్గ దర్శకుడు. తన పాత్రలను సృష్టించడంలో ఆయన కనబరచిన ఉద్వేగ పూరిత మానవత, మా సాహితీ రీతులను రూపొందించుకోవడంలో సార్థక పాత్రను నిర్వహించింది.

అవి పాఠశాల చదువు పూర్తి చేసి. కాలేజిలో ప్రవేశించిన రోజులు. నా తరం వారిలో చాల మందితోపాటు నేనూ మాక్సిమ్ గోర్కీని కనిపెట్టినది ఆ రోజుల్లోనే, ఈ దేశం మీదా. ముఖ్యంగా సృజనశీలురైన దీని రచయితల మీదా ఆయన అప్పటికే ప్రబలమైన ప్రభావాన్ని ప్రసరింపజేశారు. అయినప్పటికీ, ఈ కొత్త ప్రభావం వల్ల ప్రోత్సాహం పొందిన సాహిత్యోద్యమం ఇంకా వికాసం పొందవలసి ఉంది. ఆనాటి వరకు టాల్‌స్టాయ్, చెకోవ్· దోస్తాయెవ్‌స్కీల ద్వారానే రష్యన్ సాహిత్యం భారతదేశంలో ఎక్కువగా పరిచయమయింది. వారు ముగ్గురూ రచయితల్లో ఉద్దండులు. ప్రపంచ ప్రఖ్యాతిలో గోర్కీ వారితో సమానుడే, అయినా, ఆయన స్థానం వేరు. ఆ నాటివరకూ అపరిచితంగా ఉన్న ఒక సృజనాత్మక రంగం వైపు ఆయన స్పష్టంగా దారి చూపించారు. భారతీయ రచయితలు, వారివారి రాజకీయ అభిప్రాయాలు ఎలాంటివైనప్పటికీ, గోర్కీ రచనలను ఆత్రంగానూ, ప్రశంసా పూర్వకంగానూ చదివారు. మాక్సిమ్ గోర్కీ యుగమని చెప్పదగిన దాని అరుణోదయ చిరుకాంతులను అప్పటికింకా ఊహించలేకపోయినా, వారు ఆయన రచనలను అలా చదివారు.

ఆ రష్యన్ రచయితను గురించి నేను మొట్టమొదట తెలుసుకొన్నది వారి "అమ్మ" ద్వారా అని చెప్పవలసి ఉంది. విప్లవానంతరం ఆయన రాసిన గ్రంథాలను నేను ఆ తరువాత చదివాను, కాని, నా దృష్టిలో ఆయన సాహితీ భావన అంతటికీ

మూలకందం "అమ్మ" అణగారిన ప్రజలను గురించీ, వారి పోరాటాన్ని గురించిన కథల్లో ప్రపంచంలోకెల్లా అత్యుత్తమమైన వాటిలో ఒకటిగా "అమ్మ"కు ఇప్పటికీ స్థానం ఉంది.

- భవానీ భట్టాచార్య

30 ఏళ్ళకుపైగా చాలామంది భారతీయ రచయితల వికాసానికి చాలావరకు గోర్కీ ఆదర్శం కారణం అని డాక్టర్ ముల్క్‌రాజ్ ఆనంద్ అన్నారు: మేము కొంత మందిమి-రచయితలూ, పాఠకులూ—1936లో అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘాన్ని ప్రారంభించింది గోర్కీ పేరుతోనే. ఆ సంఘాన్ని స్థాపించినప్పుడు, దాని పతాకాన్ని అలంకరించిన కొద్దిమంది ప్రపంచ రచయితల పేరుల్లో గోర్కీ పేరు ఒకటి "నాలుగవ దశాబ్ది మధ్యలో గోర్కీ పేరు ఒక శంఖారావంగా ధ్వనించి, మాలోని ఉదాత్త, భావాలను వికసింపజేసింది.

ఫాసిజానికి వ్యతిరేకంగా గోర్కీ చేసిన ప్రకటనలు, అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ కార్యకలాపాలకు ప్రోత్సాహమిచ్చాయి. కొన్నాళ్ళపాటు ఆ సంఘం పేరు "ఫాసిస్టు వ్యతిరేక రచయితల సంఘమ"ని ఉండేది.

ప్రపంచమంతటా మానవజాతిలోని మంచికీ, సృజనశీలతకూ ఫాసిజం మహా ప్రమాదమనీ, మనదేశంలో ఫాసిజం తలెత్తుతున్నదనీ భారతీయ రచయితలు గుర్తించారు...ఫాసిజాన్ని నిర్మూలించడం అనేది మన రచయితల హృదయాలను స్పందింపజేసిన విషయాల్లో ఒకటి. అయితే, ఆ విషయంలో వారిని ప్రధానంగా ఉత్తేజపరచినది మాక్సిమ్ గోర్కీ. ఫాసిస్టు క్రూర మృగం దెబ్బకాచుకునేస్థితిలో ఉండవచ్చు. కాని మానవజాతి భవిష్యత్తుకు భద్రత ఉండాలంటే దానిని పూర్తిగా నిర్మూలించడం అవసరం అని గోర్కీ, తన కాలంలో ఫాసిజం గురించి అనేవారు....ఫాసిజాన్ని సామ్రాజ్యవాదం ఎలా పెంచి పోషిస్తూ వచ్చిందో, మీలో చరిత్ర జ్ఞాపకం ఉన్నవారికందరికీ తెలుసు. తగిన సమయంవచ్చినప్పుడు సోవియట్ యూనియనుకూ, సోషలిజంవైపు ప్రపంచ పురోగమనానికీ వ్యతిరేకంగా, ఫాసిజాన్ని ఉపయోగించుకోవడం కోసం సామ్రాజ్యవాదులు అలా చేశారు.

స్పెయిన్‌లోనో, జెకొస్లావేకియాలోనో, లేదా దూర ప్రాచ్యంలోనో జరిగిన ఫాసిస్టు కుట్రల అసలు ఉద్దేశం అదే. ఫాసిజానికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమంలో టాగూర్‌లాంటి మన రచయితలు ముఖ్య పాత్ర నిర్వహించారు. ఈ విషయమై టాగూర్ అద్భుతమైన రచనలు సాగించారు. నాగొచి అనే జపాను రచయిత జాబుకి జవాబు రాస్తూ ఆయన ఫాసిజం అంటే ఏమిటో వివరించారు. ఈ కృషి అంతటిలోనూ మక్సీమ్ గోర్కీ ఆశయానికీ, మన దేశరచయితలకూ మధ్య ఒక అనుబంధం ఉంది.

— ప్రొఫెసర్ హిరేన్ ముఖర్జీ

సాహిత్యమూ, జీవితమూ, సామాజిక విప్లవమూ వీటిని గురించి గోర్కీ భావాలు ఎంతో అసాధారణమైనవి. అవి సహజంగానే మమ్మల్ని ముఖ్యంగా, మనం స్వాతంత్ర్యం కోసం పోరాడుతూన్న కాలంలో ఆకర్షించాయి.

ఆ రోజుల్లో నేను యువకుణ్ణి సాహిత్యం ప్రచారం కోసమా? దాని కళాత్మక విలువలు ఎందులో ఉన్నాయి? అన్న ప్రశ్నలు నన్ను వేధించేవి. హిందీ సాహిత్యంతో పరిచయం ఉన్నవారికి అవి 'ఛాయావాదం' (మార్మికవాదం) రోజులని జ్ఞాపకం ఉంటుంది. పంత్, నిరాలా, ప్రసాద్, మహాదేవి ఆ రోజుల్లో అగ్రస్థానంలో ఉండేవారు. అభ్యుదయ ఉద్యమం రంగంమీదికి వచ్చినప్పుడు మాకొక ప్రశ్న ఎదురయింది. సాహిత్యం ప్రచారమా? లేక, అందులో కళాత్మక విలువలు ఉండాలా! ఒకలాంటి సైద్ధాంతిక చర్చ ప్రారంభమయింది. అయితే, గోర్కీ ఆదర్శాన్ని చూచినప్పుడు ఆయనలో ఎంతో వెలుగు కనబడుతుంది, లక్ష్యశుద్ధి, ఉదాత్తమయిన ఆశయాలూ, ప్రత్యేకమయిన విశ్వాసాలూ, ఉన్నతీ, ప్రమాణాలూ కలిగి ఉంటూనే ఆయన రచనలు, కళా సంబంధమైన ప్రమాణాలను పాటిస్తున్నాయి. గోర్కీ సాధించిన విజయం అదే....

— హరివంశ్ రాయ్ బచ్చన్

"రష్యన్ నవలా రచయిత గోర్కీ ప్రేమ్‌చంద్‌ను ఎంతకానో తన్మయుణ్ణి చేశాడు. ఆ రచయిత నుండి ఆయన ఉత్తేజం పొందారు, గోర్కీ

మరణవార్త విన్న సమయంలో మున్షీ ప్రేమ్‌చంద్ సుస్తీగా ఉన్నారు. అయినా, సంతాపసభకు ఆయన వెళ్ళారు. మహామహుండయిన ఆ సమకాలికుడికి తన జోహార్లు చదివి వినిపించారు. తక్కిన మహా రచయితల కన్నా గోర్కీలో విశిష్టత ఏదో ఉంది. హిందీ రచయితల దృష్టిలో గోర్కీ రష్యన్ విప్లవానికి చిహ్నం. ఒక నూతన సంస్కృతికి, ఒక నవ సమాజానికి, ఒక కొత్త ప్రపంచానికి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆయన వ్యక్తిత్వం ఇతర రచయితల వ్యక్తిత్వం కన్నా భిన్నం. గోర్కీ అంటే సోషలిస్టు విప్లవం అన్నమాట. గోర్కీ అంటే, ఆ విప్లవంలోంచి ప్రాదుర్భవించిన నూతన సాహిత్యం అన్న మాట. గోర్కీ అంటే సోషలిస్టు వాస్తవిక వాదమని పేరు మోసిన నూతన వాస్తవిక వాదమన్న మాట. ఉత్తేజం కలిగించగల మహా రచయితలు ప్రపంచంలో చాలమంది ఉన్నారు. కాని, గోర్కీకి ఒక విశిష్టత ఉంది. ఎందువల్లనంటే, ఒక నూతన సిద్ధాంతానికి ఒక కొత్త సాహిత్యానికి. ఒక నవ్య మానవతావాదానికి ఆయన ప్రాతినిధ్యం వహిస్తున్నారు. గోర్కీ విషయంలో మానవతావాదం అనే మాట తరుచు విన బడుతూ ఉంటుంది. అయితే, ఆయన మానవతావాదం తరహాయే వేరు అన్న విషయాన్ని గమనించాలి. ప్రేమ్‌చంద్, గోర్కీలో చూచిన మానవతావాదం టాల్‌స్టాయ్ మానవతావాదం కాదు."

— డాక్టరు నామ్‌వర్‌సింగ్

ఉర్దూ రచయితల దృష్టిలో గోర్కీకి అదనపు ప్రాధాన్యం ఉంది. అబ్దుల్ హలీమ్ షారర్ యొక్క "దిల్ గుదాజ్", తదితర ఉర్దూ పత్రికలు, 19వ శతాబ్ది చివరి భాగం నాటికే, ఆయనను అనేక విధాల ఉర్దూ రచయితలకు పరిచయం చేశా రని విన్నాను, ప్రేమ్‌చంద్‌పై ఆయన ప్రభావం గాఢంగా ఉండడం మాత్రమే కాకుండా, అయిదవ, ఆరవ దశాబ్దుల్లోని కథా రచయితలు సుదర్శన్, అలిఅబ్బాస్ హుస్సైనీ ఆయనకు ఎంతో కొంత రుణపడి ఉన్నారు. సాదత్‌హసన్ మాంటో, ఇస్మత్, కృష్ణచంధర్. కె. ఎ. అబ్బాస్. సుహైల్ అజ్మబాదీ, హయతుల్లా అన్సారీలాంటి వారు ఇంకా ఎంతో మంది ఈ జాబితాలో ఉన్నారు, ఆ తరువాత అన్వర్ అజీమ్, షౌకత్ సిద్దికీలు ఈ సంప్రదాయాన్ని కొనసాగించారు. సాదత్ హసన్ మంటో, లామ్ అహ్మద్, సయ్యద్ ముత్తలాబి, మఖ్మూర్ జల్లుందరి

లాంటి ప్రముఖ రచయితలు గోర్కీ రచనలను అనువదించారు.

—డాక్టర్ మహమ్మద్ హసన్

పంజాబీ రచయితలు గోర్కీ నుండి ఉత్తేజాన్ని పొందారు. నేటికీ పొందుతున్నారు. ''గోర్కీ సృజనాత్మక కృషిని చూస్తే, ఆయన ఏదో ఒక సిడి సూత్రాన్ని, రచనను గురించి ముందుగానే నిర్ణీతమయిన సూత్రాలను అనుసరించలేదని నేను భావిస్తున్నాను. ఆయన ఉత్తేజం పొందినది పుస్తకాల నుండి కాదు. చాలా పుస్తకాలను ఆయన చదివి ఉండవచ్చు. కాని జీవితంలో ఆయనకు సారథ్యం వహించిన శక్తి జీవితమే— ఆయన గడిపిన జీవితం, ఆయన రక్తనాళాల్లో పొంగులువారిన జీవితం.... పంజాబీ రచయితలకు ఆయనను నానాటికీ మరింత సన్నిహితం చేస్తున్నది ఇదే.

గోర్కీ భాష ప్రజల భాష. ఆయన రచనల్లో మరొక సుగుణం ఇది. ఈ విషయంలో కూడా పంజాబీ రచయితలు ఆయనకు సన్నిహితులు. ఆయన భాష జానపద సాహిత్యానికి సంబంధించినది. గోర్కీ తన రచనలన్నింటిలోనూ జానపద సాహిత్య సంప్రదాయాలను అనుసరించేందుకు ప్రయత్నించారు. అందు వల్లనే, ఆయన రచనలను చదువుతున్నప్పుడు, మన ప్రతిబింబం, మన వ్యక్తిత్వ ప్రతిబింబం మనకు కనబడుతుంది.

— డాక్టర్ హర్ భజన్ సింగ్

"కార్మికవర్గ జీవితాన్ని వస్తువుగా తీసుకున్న సమరశీల పంజాబీ నాటకాల్లో చాలా వాటి మీద గోర్కీ నాటకాల ప్రభావం పరోక్షంగా ఉంది. గోర్కీ యావత్తు కార్మిక వర్గాన్నీ కథానాయకుడుగా చేయడం పంజాబీ భాషలో తాను రచించిన క్రొత్త నాటకం "తదాక్సార్ - దా - నెహ్రా"లో ఆ పద్ధతిని అనుసరించేందుకు తనను ప్రోత్సహించింది. ఇంటి నౌకర్ల జీవితం గురించిన నాటకం అది. ఆయన అసాధారణమయిన నిజాయితీ, చరచర నడిచే సంభాషణలు, చిత్తశుద్ధీ, సాహస స్వభావమూ, అసాధారణమైన కళాకారుడుగా ఆయనకు ప్రత్యేకతను చేకూర్చు

తున్నాయి. మానసిక ప్రవృత్తులూ. వాటి అల్లకల్లోలాలను గురించి ఆయనకు గాఢమైన అవగాహన ఉంది. వాటిని ఆయనకు భౌతిక రూపంలో, సునాయాసంగా అప్రయత్నంగా వ్యక్తపరుస్తారు. కల్పన. వాస్తవికత; ఆత్మిక ఔన్నత్యం, క్షుద్రత— వీటి వింత మిశ్రమం ఈ రూపం.

— పరితోష్‌గార్గి

మొదటి ప్రపంచ యుద్ధానంతరం, గోర్కీ చేత ప్రాభావితులయిన కొంత మంది బెంగాలీ రచయితలు. బెంగాలీ సాహిత్యంలో ఒక కొత్త రీతివి ప్రవేశ పెట్టారు. అభ్యుదయ రచయితల ఉద్యమానికి దారి తీసినది ఇదే. గోర్కీ రచనలను మొట్టమొదట బెంగాలీ భాషలోకి అనువదించిన శ్రీ పవిత్ర గంగోపాధ్యాయ తొలిసారిగా గోర్కీ రచనలను చదివినప్పుడు ఆయన ఎంతగానో చలించిపోయారు, పూర్వం ఛాప్మన్ ఇంగ్లీషులోకి అనువదించిన హోమర్ గ్రీకు గ్రంథాన్ని చదివినప్పుడు ఇంగ్లీషు మహాకవి కీట్సు పొందిన అనుభూతినే ఆయన ఆ సందర్భంలో పొందారు, గంగోపాధ్యాయ గోర్కీ అభిమానుల్లో ఒకరుగా చివరి వరకూ ఉన్నారు.

— ప్రొఫెసరు హీరేన్ ముఖర్జీ

గోర్కీ ఉద్దేశంలో మానవులు బాధపడ్డం ప్రపంచానికీ అవమానం, మనిషి దీన్ని వ్యతిరేకించాలి, పారద్రోలటానికి ప్రయత్నించాలి. ఇదే మానవత్వం. శక్తి వంతమైన పోషలిస్టు మానవత్వాన్ని మనమందరం గోర్కీ నుంచి నేర్చుకోవాలి,

గోర్కీ ఆయన బతుకు పుస్తకాల ద్వారా మనకు చెప్పేదేమిటంటే, రచయితలు ప్రజల్లో కలిసిపోయి. ప్రజల జీవితానికి సంబంధించిన ప్రపంచంలో వస్తున్న, రాబోతున్న మార్పుల్ని గురించి రాయాలి.

—రఘునాథన్



**వ్యాసం**

# ఉర్దూ సాహిత్యంపై గోర్కీ ప్రభావం

—సయ్యద్ ఎహతెషాం హుస్సేన్

ఉర్దూ సాహితీ వేత్తలందరికీ గోర్కీ బాగాతెలుసు. ఎంత బాగా తెలుసంటే తమ రచయితలూ- మేధావుల్లో ఒకణ్ణిగా గోర్కీని భావిస్తారు. ఎందుకంటే: గోర్కీ తన కథల్లోనూ, నవలల్లోనూ, నాటకాల్లోనూ వర్ణించిన సామాన్యుల జీవితం సగటు భారతీయ పాఠకులందరికీ పరిచయమైందే, అదీకాక గోర్కీ ప్రతిపాదించే మానవతా వాదం, సృజనాత్మక భావాలు; మనదేశం ఎదుర్కొంటున్న సామాజిక, ఆర్థిక సమస్యలను అర్థం చేసుకోవడంలో బాగా సాయపడ్డాయి. భారత దేశం స్వాతంత్ర్య పోరాటంలో నిమగ్నమై ఉన్న సమయంలో, ఫాసిజం పరిశ్రమ అంతటా వేళ్ళూనుకుంటోంది. అంతేకాదు యుద్ధ మేఘాలు ఐరోపా అంతటా అలుముకుంటున్నాయి. ప్రపంచమంతా ఆర్థిక సమస్యల సుడిగుండంలో చిక్కుకొంది. మన భారత దేశం దుర్భర దారిద్ర్యంలో మునిగి ఉంది. యువకులకైతే తమ వ్యక్తిగత జీవితాల్లో ఏమంతా ఆసక్తి, రుచీ కనబడక పోవడమేకాదు నిరర్థకంగా కూడా కనిపించేది. సామాజిక జీవితం వర్గ పోరాటాలతో నిండి ఉండేది సరిగ్గా ఈ సమయంలోనే భారతదేశంలోని కొత్త రచయితల కందరికీ గోర్కీ పరిచయమయ్యారు. గోర్కీ కేవలం సోవియట్ యూనియన్‌కు చెందిన వాడుగా వాళ్ళకు కనిపించలేదు. అధికారానికి, అణచి వేతకూ, అన్యాయానికీ, దోపిడీకీ, బానిసత్వానికీ, వెనుకబాటు తనానికీ వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రతి దేశానికీ చెందినవాడుగానే గోర్కీని భావించారు, ఈ పరిచయమే రచయితలందరిలో సమైక్య భావం పెంపొందించి భావవినిమయానికీ, కలిసికట్టుగా ఉండడానికీ సాయపడింది.

20వ శతాబ్దం, 3వ దశకం భారత రాజకీయాలు విప్లవాత్మకతను సంతరించుకున్నాయని వేరే చెప్పక్కర్లేదు. శ్రామికా వర్గం, కొంతవరకూ కర్షకులూ,

వ్యతి, పనివాళ్ళు, మధ్యతరగతి ఉద్యోగులూ అందరూ క్రమంగా చైతన్యవంతు లవుతున్నారు. తెల్లదొరలూ, భారతదేశంలోని వాళ్ళ తాబేదారులూ ఏ సాహిత్యం తమ వర్గల ప్రయోజనాలకు ప్రమాదకరమైందని భావించారో దాన్ని రహస్యంగా చదవడం ఆరంభమైంది రష్యాలో విప్లవం విజయవంతం అయింతర్వాత. భారత రచయితల్లో పలువురు మనో వికాసానికీ, ప్రేరణకూ ఆదిశగా చూడడం ఆరంభించారు భావిపత్వ విముక్తితో రష్యా విప్లవ మార్గమే సరైందని భావించారు అంతటి మహత్తర విప్లవాన్ని నడిపిన సోవియట్ రష్యా రచయితల్లో, మేధావి వర్గాల్లో గోర్కీకున్న గౌరవాభిమానాలు ఈ రచయితలను గోర్కీకి మరింత సన్ని హితులను చేసింది.

ఆంగ్ల ప్రభుత్వం అమానుషత్వం పరాకాష్ఠకొచ్చిన 1930-1931లో భారతీయయువత తమ జీవితాలను సైతం పణంగా పెట్టి విప్లవోద్యమాన్ని ఉధృతం చేసింది, పంజాబ్ అసెంబ్లీలో బాంబు విసరి "విప్లవం వర్ధిల్లాలి" అంటూ వినదించిన భగత్‌సింగ్ యువకుల ఆశయాదర్శాలకు ఆదర్శ ప్రాయుడైన నాయకుడయ్యాడు. భగత్‌సింగ్‌ను ఉరి తీసినప్పుడు ప్రతి యువకుడూ తమ చీకటి గదుల్లో అతడి చిత్రాన్నుంచి ఆరాధించటం ఆరంభించారు. విప్లవ సాహిత్యం రహస్యంగా అధ్యయనం చేయసాగారు, పంజాబు నుండి ప్రచురితమయే పత్రికలన్నిట్లోను యువ రచయిత లెందరో ఈకొత్త భావాలను అనేక కొత్త ప్రక్రియల ద్వారా ప్రయోగం చెయ్యడం ఆరంభించారు అలాటి వాళ్ళలో సోషలిస్టు రచయిత "బారి" కూడా ఒకరు. అభ్యుదయ సాహిత్యాన్ని అపారంగా చదివాడు, ఇలాటి భావాగ్నులతో మండే గుండెలున్న యువ రచయిత లెందరో అతడిచుట్టూ ఉంటూండేవారు. అలాటి వాళ్ళలో సాదత్ హసన్‌మింటో, హసన్ అబ్బాస్‌లు ముఖ్యులు వీళ్ళందరూ లెనిన్, మార్క్స్, రూసో, వాల్టేర్. విక్టర్ హ్యూగో, గోర్కీల రచనలు రహస్యంగా చదివి నిత్యం చర్చించుకుంటూండే వాళ్ళు.

మింటో అప్పుడప్పుడే తన సాహితీ జీవితాన్ని ఆరంభించాడు. అతడి రచన కొత్తదారులు వెతుక్కుంటూండేది. విక్టర్ హ్యూగో నవలలను అనువాదం

చేసిన తర్వాత, గోర్కీని అనువదించడం ఆరంభించి అనేక కథలను వివిధ పత్రికల్లో ప్రకటించాడు. ఇవన్నీ తర్వాత "గోర్కీ-కథలు" అన్న సంకలనంగా వచ్చాయి. తన మిత్రుల సాయంతో సోవియట్ సాహిత్యం మీద ఒక ప్రత్యేక సంచికను తెద్దామని ఎంతో సంకల్పించాడు. అతను సేకరించిన విప్లవ సాహిత్యం కట్టలో ఎక్కువ భాగం గోర్కీ రచనలే. కొంత కాలం తర్వాత మంటో మిత్రుడు హసన్ అబ్బాస్ గోర్కీ డైరీల్లో కొంత భాగాన్ని అనువాదం చేసి అదేశీర్షికతో పుస్తకంగా ప్రకటించాడు. అప్పటి నుంచి ఉర్దూ తెలిసిన రచయితులకూ, పాఠకులకూ గోర్కీ అభిమాన రచయిత అయ్యాడు.

ఫాసిజానికీ వ్యతిరేకంగా ప్రపంచవ్యాప్తంగా అభ్యుదయ రచయితలు తమ గళాలెత్తిన అంతర్జాతీయ సమావేశం పిలుపును గోర్కీ అంగీకరించి నాయకత్వం వహించడం రచయితల్లో మంచి వాతావరణాన్ని కల్గించింది. ఫాసిస్టుల యుద్ధ పథకాలను రచయితలు బహిరంగంగా వ్యతిరేకించడం ఆరంభించారు. ఉర్దూ రచయితలందరూ స్పందించారు. ఈ ఘటనలను తన "స్మృతులు" అన్న గ్రంథంలో సజ్జాద్ జహీర్ చాల చక్కగా వర్ణించారు. ఈ సభల ప్రాధాన్యాన్ని గూడా వివరించారు. అప్పటికే భారతదేశంలోని చైతన్యవంతులయిన పెద్ద రచయితలందరూ గోర్కీ రచనలు— అమ్మ, స్వీయ చరిత్రలతో బాగా పరిచయం కల్గి ఉన్నారు. మొదటి రోజుల్లో భారత దేశం చేరిన సోవియట్ సాహిత్యంలో గోర్కీ నాటకాలు - వ్యాసాలూ లేవు. అయినా ప్రేమ్‌చంద్ ఇంకా పలువురూ గోర్కీ నవలలు, నాటకాలూ చదివి ఉత్తేజితులయ్యారు. అందులో ఉన్న మానవత్వం మీది ప్రేమ, సోషలిస్టు వాస్తవికత, విప్లవ కాల్పనికత గోర్కీని వీరికీ సన్నిహితునిగా చేశాయి. ప్రేమ్‌చంద్ ఈ అంశాన్ని బహిరంగంగా వ్యక్తీకరించడమే కాదు గోర్కీ మరణవార్త విన్న వెంటనే, తన ఆరోగ్యం బాగా లేకున్నా, ఓ పెద్ద వ్యాసాన్ని తయారు చేసుకొని వెళ్ళి సంతాపసభలో ప్రసంగించాడు! భారత దేశంలోని ఉర్దూ రచయితలందరూ గోర్కీ మరణానికి ఎంతలా బాధ పడ్డారంటే తమకు బాగా తెలిసిన వ్యక్తి తమ మధ్యనుండి వెళ్ళిపోయినట్టుగా భావించారు.

ఉర్దూ అభ్యుదయ రచయితల పత్రిక ఉర్దూ—అన్న పత్రికలో డా॥ అక్తర్

హుసేన్ రాయపురి 1936లో పని చేస్తుండేవారు. గోర్కీ మరణానికి ఆ పత్రికలో గోర్కీ రాయ్‌పురి అర్పించిన నివాళి ఉన్నత సాహిత్య సాంప్రదాయాలను నిల బెట్టేదిగా ఉండడమే కాదు మొత్తం ఉర్దూ సాహితీలోకం ఓ రచయితకు అర్పించి నట్టుగా అపూర్వంగా ఉంది. అక్తర్ రాయ్‌పురి గోర్కీ స్వీయ చరిత్రలు మూడు సంపుటాలుగా ఉర్దూలోకి అనువదించి ఉర్దూ అభ్యుదయ రచయితల సంఘం పక్షాన వెలువరించారు, తర్వాత రాయ్‌పురి రాసి ప్రచురించిన సాహిత్యం-జీవితం' అన్న గ్రంథంలో; గోర్కీ సాహిత్యాభిప్రాయాలూ, అతడి వాస్తవికతా దృక్పథం, ఫాసిస్టు వ్యతిరేక భావాలు - ఎలా రాయ్‌పురిని ప్రభావితం చేశాయో కనిపిస్తాయి.

ఉర్దూ సాహిత్యంలో అభ్యుదయ రచయితల ఉద్యమం అప్పటికే స్వతంత్రంగా ఉన్నత స్ఫూర్తిని పొందింది. యువరచయితలు, కవులు, నాటక కర్తలు, కథకులు పలువురు ఈ ఉద్యమంతో ఏకమై మొదటి మహా సభలో పాల్గొన్నారు. దానికి ప్రేమ్‌చంద్ అధ్యక్షత వహించారు. అభ్యుదయ రచయితలందరూ ఎంతో చైతన్యంతో, స్ఫూర్తితో గోర్కీని అధ్యయనం చెయ్యడం మొదలెట్టారు. గోర్కీ ప్రభావంతో నవలలతో బాటు, కథానికలూ రాసాయి. సాహిత్యంలో సామాజిక వస్తువు, సంస్కృతి శ్రమల మధ్య ఉన్న సంబంధం, సోషలిస్టు వాస్తవికత, శ్రామిక సంస్కృతిలో దాని ప్రాధాన్యం లాంటి గోర్కీ తాత్విక చింతనలు – సాహిత్య సిద్ధాంతాలూ ఉర్దూ రచనల్లో కనిపించడం ఆరంభించాయి. అభ్యుదయ ఉర్దూ సాహిత్య విమర్శకులు అప్పటికే మార్క్సిజం — లెనినిజం మూల సూత్రాలతో పరిచయం ఉన్న వాళ్ళు - గోర్కీ సాహిత్యం ద్వారా ఆ సిద్ధాంతాలను సాహిత్యానికి ఎలా అన్వయించాలో నేర్చుకున్నారు. అతని భావాలూ దృక్పథాలూ ఎంత విస్తృతంగా ఉర్దూ విమర్శలో ప్రవేశించాయంటే విడమర్చడం కష్ట సాధ్యమయ్యేది.

1939లో ఉర్దూ అభ్యుదయ రచయితల అధికార పత్రికగా "నయాఅదబ్" లక్నో నుండి వెలువడడం మొదలైంది. అది మార్క్సిస్టు-మాక్సిం గోర్కీ భావాలను ప్రతిబింబిస్తూండేది. ఈ పత్రికలోనే గోర్కీ రాసిన "ది డిస్ట్రక్షన్ ఆఫ్

పర్సనాలిటీ" అన్న గొప్ప వ్యాసం అచ్చైంది అందులోనే వ్యక్తిగత స్వీయాత్మక భావ వ్యక్తీకరణల లక్షణాలన్నీ చర్చించాడు. గోర్కీ మొదటి నుండీ తన రచనలన్నిటా సోషలిస్టు వాస్తవికతా లక్షణాలను ప్రతి పాదించేవాడన్నదీ దీని మొదటి గ్రంథకర్త ఇతడేనన్నదీ అందరికీ తెలిసిందే. అస్పష్టత-అంతమయం భావాలను ప్రేమించే వాళ్ళు అభ్యుదయ భావజాలాన్ని ఈసడించుకొనేవాళ్లు. సామాజిక జీవితంలోని సత్యాలను ఎదుర్కొనే ధైర్యంలేనివాళ్ళు గోర్కీ వ్యక్తపర్చిన వాస్తవికత పైపైదనీ, జీవితం లోతులను పట్టనిదనీ అంటూ విమర్శిస్తారు. ఈ విమర్శకులు గోర్కీ రచనలు చదివి చేసే విమర్శకాదిది. తమ సామాజిక వ్యతిరేక భావాలను కప్పిపుచ్చుకొనేందుకే ఇలా విమర్శించే వాళ్లు గోర్కీ ఎప్పుడూ సాహిత్యంలో అత్యున్నతమైన సౌందర్య వాదం ఆవశ్యకతను నొక్కి చెప్పాడు జీవితం పైపై అంశాలను తడివేదాన్ని దేన్నీ సాహిత్యంగా గోర్కీ భావించలేదు. సృజనాత్మకతకు దూరంగా ఉండీ-మానవుల ఉద్వేగాలనూ-విశ్వాసాలనూ, సరిగా ప్రతి బింబించనిది సాహిత్యం కాదంటాడు గోర్కీ. గోర్కీ ప్రతిపాదించిన సౌందర్య వాదాలు ఎప్పుడూ విచ్ఛిన్నాన్ని కోరేవికావు. అతడు మానవ శ్రమను ఒక సృజనాత్మక భావనగా చెప్పి సౌందర్య సృజన ఒక "కళ" అని అంటాడు. ఏసిద్ధాంతాన్నైనా పల్చన చెయ్యడం గోర్కీకి ఇష్టంలేదు కళలో సౌందర్యవాద ప్రతి పాదన చెయ్యని ఏ రచయితనూ అతడు క్షమించలేదు. సమాజ పరిశీలనా-ప్రయోగ వాదమూ తెలీనివాడెవడూ రచయితకాలేడంటాడు. మనిషి మనిషిని అణిచే పద్ధతీ, దోపిడీ పట్ల శీతకన్ను వేసిన వాడూ. మానవత్వం సానుభూతిలేని వాడూ అంటే గోర్కీ దృష్టిలో విలువలేని మనిషి, జాతి వివక్షకూ, సంకుచిత వాదానికీ తీవ్రవాద జాతీయ తత్వానికి, వర్గ దోపిడీకీ గోర్కీ బద్ధశత్రువు. తమ సృజనాత్మక రచనల్లో ఆరోగ్యవంతమైన వాస్తవికత ప్రతిబింబిస్తున్న ఉర్దూ రచయితలందరిలోనూ ఈ పై అంశాలన్నీ కనిపిస్తాయి, ఎంత అందమైన ముసుగులో చెప్పినా: నిరాశా, నిస్పృహ, విచ్ఛిన్నం, మృత్యువు, ఆత్మహత్యలను ప్రతిపాదించే కవులనూ- రచయితలనూ ద్వేషించడం ఉర్దూ రచయితలకు గోర్కీయే నేర్పాడు; స్వార్థపరులూ, మానవ సంవేదనలు తెలియని వాళ్లూ: వాళ్ళరచనలెంత అలంకార ప్రాయం, ఆకర్షణీయమైన భాషా కలిగి ఉన్నా ఉత్తమ సాహిత్యాని సృష్టించలేరు.

మంచి రచయితలందరికీ నేటికీ ఆదర్శప్రాయంగా ఉంటున్నది ఈ గోర్కీ వారసత్వమే. ఈవెలుగులో తప్పుడు దార్శనికతనూ, సామాజికవ్యతిరేక భావాలనూ బట్టబయలు చెయ్యొచ్చు. నిత్యం మారుతున్న మానవ జీవితాలను సరిగా ప్రతిబింబించదగ్గదిగా సాహిత్యాన్ని గోర్కీ భావించాడు. ఈ అద్దం సరిగా ఉపయోగించడం తెలీని రచయితల వల్ల సమాజం అసలైన ప్రతిబింబం వక్రీకృతమయ్యే ప్రమాదముంది.

గత చాలా ఏళ్ళుగా గోర్కీ ప్రముఖ రచనలెన్నో ఉర్దూలోకి అనువాదమయ్యాయి. ప్రధానంగా గోర్కీ "అమ్మ" రెండు అనువాదాలొచ్చాయి. స్వీయ చరిత్ర మూడు భాగాలుగా ఒక్కటి భారత దేశంలోనూ, మరొటి సోవియట్ యూనియన్‌లోనూ రెండు పర్యాయాలు ప్రచురితమయ్యాయి. నాటికలు కూడా ఉర్దూలోకి వచ్చాయి వీటన్నిటికన్నా గోర్కీ సాహిత్య సిద్ధాంతాలూ, ఉత్తరాలూ, డైరీలు ఉర్దూలో రావడం అవశ్యకం. గోర్కీ ప్రభావం ఉర్దూ ఆధునిక సాహిత్యంలోని అన్ని ప్రక్రియల మీదా ఉంది. ఈనాటి ఉర్దూ యువ రచయితలందరి మీదా గోర్కీ ప్రభావం కనిపిస్తున్నా, గోర్కీని ఉన్నత పథాలకు చేర్చిన అతడి మానవ ప్రేమ ఈ రచయితలకు కొరవడినట్టు కనిపిస్తుంది. ❁

అనువాదం : వీరి

గోర్కీ సాహిత్యాన్ని మనిషి అభ్యున్నతికి తోడ్పడేదిగా చూశాడు. మనిషిలో ధైర్యాన్ని నూరిపోసే, జీవితంపైన నమ్మకాన్ని కలిగించే, మనిషిని ముందుకు నడిపించే సాహిత్యాన్ని ఆయన ప్రేమించాడు.

— భీష్మసహాని

వ్యాసం

# గోర్కీ గొప్పదనం

—ఎ. లూనచార్స్కీ

బ్రహుశా సమాజంలో వచ్చే మార్పులూ, ఉత్పాతాల ఫలితంగా మహత్తరమైన సాహిత్యపరిణామాలూ. గొప్ప రచయితలూ ప్రాదుర్భవించడం జరుగుతూ వుంది.

టాల్‌స్టాయ్‌పై లెనిన్ అద్భుత రచనలను మార్క్సిస్టు సాహిత్య విమర్శకు డెవ్వరూ ఉపేక్షించడానికి వీలులేదు. టాల్‌స్టాయి అవతరణకు, అతని ఉనికికి, అతని ప్రతిభా వికాసానికీ అవకాశం ఏర్పడడానికీ రష్యాలోనూ, యావత్ ప్రపంచంలోనూ అతని విజయదుందుభి మ్రోగడానికీ, అతని కళా వైదగ్ధ్యం అజరామరంగా వెలుగొందడానికీ, అతని తాత్విక• సామాజిక చింతనా దారిద్ర్యానికీ అనివార్యమైన సామాజిక కారణమేమిటో లెనిన్ ఈ రచనలలో వివరించారు. ఆనాడు రష్యాలో ఊపి వేసిన బ్రహ్మాండమైన ఉత్పాదమే కారణం. అప్రతిహతమైన పెట్టుబడిదారీ దాడికి తాళలేక పాత రష్యా, రైతుల భూస్వాములు రష్యా అంతరిస్తోంది.

భయంకరమైన, అశ్రుధారాప్లుతమైన ఆ నాటకంలో, రష్యన్ రైతు కథానాయకుడు; దురదృష్టవశాత్తు క్రియా శూన్యుడైన కథానాయకుడు,

ఈ సంక్షోభం రైతులను నానాహింసలు పెట్టింది. ఆదే సమయంలో భూస్వాముల పైనా దెబ్బతీసి, వారిని అట్టడుగుకు నెట్టివేసింది. భూకంపంలో లాగా పాత పద్ధతులు పునాదులతో కదల నారంభించాయి.

తాను పుట్టి పెరిగిన వాతావరణం, విద్య, సంస్కృతి, కోమల హృదయం రచనాశక్తి—వీటి మూలంగా రైతుల కన్నీటిని, వారి దిగ్భ్రాంతినీ, కళా ఖండాలుగా మార్చగల ఒక-వ్యక్తి రంగంపైకి వచ్చారు.

టాల్‌స్టాయ్‌లాగానే ఉత్తరోత్తరా గోర్కీ కూడ, మన దేశ చరిత్ర మరో పెద్ద ముందంజ వేసినందుకు చిహ్నంగా ఉన్నారు.

బూర్జువావర్గం అధికారానికి వచ్చింది. ప్రభువర్గంతో కలిసి అది అధికారం పంచుకొన్నప్పటికీ, తానే ప్రధానమయిన వర్గంగా అది ఢంకా బజాయించి విర్రవీగింది. ఆసించుకొన్నది. బూర్జువా వర్గంతో అధికారం పంచుకొన్నవారు కొత్త రకం ప్రభువులు. వీరి మొదటి ప్రతినిధులనే టాల్‌స్టాయ్ "అన్నా కెరినినా"లో అంతటి ఏవగింపుతో చిత్రించారు.

మొత్తంపై డబ్బు దేశాన్ని పాలించింది. అయితే, సాంస్కృతిక ఆర్థిక రంగాలలో అది నిర్వహించిన పాత్ర చాలా తక్కువ, దాని ఆకలికీ అతకూ అంతులేదు. సహజంగా అది కొంత సృష్టించింది, కాని అంతకన్నా పదింతలు నాశనం చేసింది.

పెట్టుబడిదార్ల విధాన పురోగమనం గ్రామాలను అధికాధికంగా పీడించసాగింది. అయితే యువకుడయిన గోర్కీ కళాఖండాలే నూతన పీడా తంత్రుల నుండి వినవచ్చింది ఈ గ్రామాల విట్టూర్పులూ, మూలుగులూ కాదు.

గోర్కీ సామాజిక స్థానాన్నిబట్టి, ఆయనకు, నిస్తబ్ధంగా, నిల్చిన మురుగు నీరులా వున్న నగరంలోని పీడిత పెట్టీబూర్జువావర్గ సమాజాన్ని గురించి, అంతన్నా బాగా తెలుసు. బ్రతుకు రోకటి పాటలావున్నా, ఎంత వింత వ్యక్తులతో నిండిన సమాజం అది.

వీరే, గోర్కీ రచనలకు మొదటి వస్తువులయ్యారు. ఆయన నగర జీవిత పైపరీక్ష్యాలలో ఒకటయిన బికారిని తన వస్తువుగా స్వీకరించారు. ఆ తర్వాత క్రమంగా ఆయన దృష్టి శ్రామిక వర్గం మీదకు మళ్ళింది.

టాల్‌స్టాయ్ ప్రాదుర్భావానికి కారణభూతమయిన సామాజిక మార్పు ఒకే దిశలో జరిగిన మార్పు. అది శరవేగంతో పురోగమించిన పెట్టుబడిదారీ పరిశ్రమల వల్ల జరిగిన పాత రష్యా విధ్వంసన అని నిర్వచించవచ్చు.

టాల్‌స్టాయ్ చరిత్ర శపించిన తన వర్గం నుండి. సైద్ధాంతికంగా, రైతాంగంలోనికి పారిపోయి తలదాచుకొన్నారు. అయితే ఆ రైతాంగానికి కూడ బయటపడే మార్గం లేదు దారిద్ర్యంలో మగ్గుతున్న కర్షక లోకానికి ఆ తరువాత ఎన్నో సంవత్సరాలకు గాని, మార్గం కనిపించలేదు, విజయలక్ష్మిని చేపట్టిన శ్రామిక వర్గమొక్కటే రైతులకు మార్గం చూపగల్గింది.

మాక్సిమ్ గోర్కీని రంగంపైకి తెచ్చిన మార్పు పూర్తిగా భిన్నమైనది. అది ద్విముఖమైనది. అందువల్ల ముందు మార్గం చూపగలిగింది.

పెట్టుబడిదారీ విధానం ఒక పెద్ద గుదిబండలా దేశ ప్రజానీకాన్ని కుంగ దీస్తూ వున్నప్పటికీ, పైన పేర్కొన్నట్లు అది పగుళ్ళివ్వడం ప్రారంభించింది. త్వరలో దాని పతనం తథ్యమనడానికి ఇది సూచన. సాహిత్యంలోకూడ, పెట్టుబడి దారీ విధాన విజయం విజయగీతికల్లో కన్నా, ఆక్రందనాలలో ఆర్తనాదాల్లో ప్రతి బింబితం కావడం గమనార్హం.

అయితే పెట్టుబడిదారీ విధానమనే కారుమబ్బుకు శ్రామికవర్గమనే మెరుపు తీగ ఒకటి అంటిపెట్టుకొని వుంటుంది. చరిత్ర దీనినే భావి సమాజానికి పునాదిగా చేసింది.

ఈ యుగసాహిత్య రవికి మొదట కనిపించింది. పెట్టుబడిదారీ విధానంలోని మరొక అంశమన్న మాట నిజమే. సాగిపోతూన్న పెట్టుబడిదారీ విధాన రథచక్రాల క్రింద రైతాంగంలాగానే పడి నలిగిపోతూన్న క్రింది మధ్య తరగతుల దయనీయ మైన ఆర్తనాదాలే గోర్కీ రౌద్రోగ్ర సంగీతాన్ని రేకెత్తించిన మొదటి హృదయ ప్రకుతులు.

ఔను, గోర్కీ, రైతుల చెప్పులూ చొక్కాతో సాహిత్యరంగంలో అడుగు పెట్టారు. అతను క్షమ పీడితుడు, కాని బలోపేతుడు, శోకవారిధి లోతులు చూచినవాడు. కాని, ఆనందాన్ని చవిచూడాలనే ఉత్కంఠ కలవాడు. చదపురుగులను గురించిన భయంకర సత్యాన్ని, సంపూర్తిగా చెప్పడానికై, వాటి అంధత్వం, కశ్మలం, బీభత్సజీవితం గురించి చెప్పడానికై గోర్కీ, తన చీకటి గూటితోపోలిస్తే

అద్దాలమేడల్లా వున్న పత్రికా కార్యాలయాలకు వచ్చారు. ఇదీ, అతని మహదాశయం. ఇదీ, అతని కోపం వెదల నుమిసిన పలుకుల నిప్పులు, ఎత్తిపొడుపుతో, నిర్దాక్షిణ్యతతో కూడుకొన్న, కశాఘాతంలా వున్న అతని వాస్తవికతను దిద్దితీర్చింది ఇదీ.

బాధా సర్పదష్టుల నోళ్ళలో మత్తు కలిగించే నల్లమందు లుక్కా. వాళ్ళను ఓదార్చజూచే ల్యూకా "అధోలోకాలు" లాంటి వారిని గోర్కీ ఖండించారు. "అబద్ధాలు చెప్పే చిక్"లాగా, గోర్కీ తన సోదరులైన పేదలకు కల్లబొల్లి కబుర్లు చెప్పదలచుకో లేదు. ఆయన చిత్తశుద్ధి ఎంతటి దంటే, తన పాళీనుండి కాగితం పైకి రావడానికి సిద్ధంగా వున్నదా అనిపించిన "ఉదాత్త వంచనను", అతప్పుడు ఉపశమన పద్ధతిని ఆయన నిరాకరించారు. ఆ చిత్తశుద్ధీ, ఆ ధైర్యమూ ఆయన తొలి రచనలో ఒక నూతన సంగీత పక్కీని. కదంతొక్కుతూ ముందుకు తోసుక వస్తున్న శ్రామిక వర్గ ఆగమనాన్ని ఆయనకు తెలిసీ తెలియకనే ప్రతిబింబించాయి.

కార్మికుల సంఖ్యాబలమూ చైతన్యమూ దినదినాభివృద్ధి చెందుతున్న ఫలితంగా విప్లవయుగపు సూచనలు వాతావరణంలో కనిపించి వుండకపోతే, గోర్కీ తీవ్ర నిరాశావాదానికి బలియై వుండేవారేమో! క్షీణముఖంపట్టిన నరోద్నికుల ఆదర్శ వాదంపట్ల గోర్కీకి అసంతృప్తి హెచ్చిందని మనకు తెలుసు. గోర్కీ (చేదు) అన్న ఆయన కలం పేరు నిరాశా వాదయుత నీతి ప్రబోధాలకు హెచ్చరికగా కనిపించడం లేదా?

రష్యన్ పతితలకు ఆయన గంభీరమైన కంఠంతో, పేదల భయంకర జీవితాన్ని గురించి చెప్పారు. ఆయన కథలు ఒక్కొక్కమారు భరించరానంత తీవ్రంగా ఉండేవి. అయినప్పటికీ గోర్కీ పతితలకు చేదు మాత్రగా తోచలేదు.

కారణమేమిటి?

కారణ మేమిటంటే. గోర్కీ జేబుల నిండా ఉన్నవి పచ్చని, ఎర్రని, నీలపు చిత్రాలూ, జానపద కథలూ. వాటిలో అమాయికమైన కాల్పనిక తత్వమూ ఉంది; వీర రసమూ ఉంది. వాస్తవికతతో కూడిన గోర్కీ అద్భుతమైన రచన అయిన "చెల్కాష్"లో సైతం (ఈ రచనతో ఆయన పేరు ప్రఖ్యాతులు సంపాదించారు)

చాల్కాష్ చింపిరి తలకు, కందువారిన రొమ్ముకు. చిరిగిన గుడ్డలకు మానవుని హుందాతనం, అతని వీరోచిత నిరసన గర్జన వన్నె తెస్తున్నాయి.

గోర్కి త్వరలోనే తన జానపద కథావ్యాసనను విసర్జించారు. కాని, ఆయన వీరోదాత్తమయిన నిరసన, అంతకంతకు జీవిత సత్యంలో భాగం కానారంభించింది ఈ విధంగా గోర్కి స్వరజతులు. గోర్కి అమృతగానం: గోర్కి మధురకృతి అవతరించింది.

టాల్‌స్టాయ్ ఇలాంటి వీరోదాత్తనిరసనను పూనుకోలేకపోయారు. తన వర్గానికి చెందిన ప్రభువులనుండి, మహిళలనుండి గానీ, యాస్నయా పోల్యానా గ్రామీణ రైతాంగం నుండిగాని ఆయనకు ఏ ఆశాకిరణమూ కనిపించలేదు. అందు వల్ల పోరాటానికి రణభేరి మోగించలేకపోయారు.

టాల్‌స్టాయ్ నిస్సందేహంగా ప్రకృతిని ప్రేమించారు. ఇంతా అంతాకాదు. మామూలు మనిషికన్న ఎంతో ఎక్కువగా ప్రేమించారు, ఆయన జంతువుల మనస్తత్వం ఎంత బాగా అర్థం చేసుకొన్నారని: ప్రకృతిని ఆయన హృదయమూ, పంచేంద్రియాలూ, ఆయన దేహంలోని ప్రతి అణువూ ప్రేమించాయి. నడవడం అంటే ఆయనకు మహా ప్రీతి, ఎనభై ఏళ్ళ వయస్సులో కూడ గుర్రమెక్కి-స్వారి చేసేవారు. అనేక సంవత్సరాలు వేట అంటే పడి చచ్చేవారు: ఎక్కువ భాగం ఆయన గ్రామసీమలోనే నివసించారు. ఆయన ప్రకృతికి చెందిన మనిషి అని చెప్పవచ్చు

కాని రచయితగా, సిద్ధాంతవేత్తగా టాల్‌స్టాయ్‌కి ప్రకృతి అంటే గిట్టదు. ప్రకృతిపట్ల ఉపేక్ష వహించడమేకాదు దాన్ని చూస్తే భయపడేవారు; ఇంచుమించు ద్వేషించేవారు,

మహా అయితే, పుడమితల్లిని అంగీకరించేవారు. ఎందుకంటే, భూమిని దున్నవచ్చు: మానవుని దైనందిన ఆహారానికై ధాన్యపు కంకులను కోసుకో వచ్చు. అంతే—అంతకు మించిపోరు,

ఎందుకంటారా? ప్రకృతి అంటే ఏమిటి? ఈ పగళ్ళ వెలుగులూ, రేల హాయీ? రంగురంగుల సింగారమూ. మత్తుగొలిపే సువాసనలతో గుబాళించేపూలు?

"జంతుకోటి ఎలా జీవిస్తూ, సుఖిస్తూ, పోరాడుతూ, తమ్మతాము వృద్ధి చేసుకొంటూ వుందో అలాగే నీవూ బతుకు, సుఖించు. మూడు పువ్వులూ ఆరు కాయలుగా అభివృద్ధికా! అయితే జంతుకోటికన్న తెలివితో, అంటే ఎక్కువ శక్తివంతంగా, చైతన్యయుతంగా ఈ పనులు చేయి" అని మానవుని బోధించే ప్రకృతి శక్తులు ఏమిటి? అవి మానవుని ప్రలోభపెట్టే శక్తి! మిథ్య! దేవుడే ఈ ప్రకృతిని సృష్టించాడని నమ్మడం కష్టం. దేవుడు ఈ దుష్ట ప్రపంచంలోనికి విస్ఫులింగాల్లాంటి అసంఖ్యాకమైన మన ఆత్మలను పంపించి, వాటికి ఒక పరీక్ష పెట్టాడు. ప్రలోభానికి లొంగవద్దు పరిశుద్ధ జీవితం గడుపు. తరువాత ప్రకృతి సంపర్కంతో అంటుకొన్న మలినాన్ని సంపూర్తిగా క్షాళనం చేసుకొని నా వద్దకు తిరిగి వచ్చి దివ్యాగ్నిలో లీనమైపో!– ఇదీ దేవుడు మనకు నిర్దేశించిన కర్తవ్యం.

అందువల్లనే టాల్‌స్టాయ్ ప్రకృతి వర్ణనలు అంత క్లుప్తంగా ఉంటాయి, ఆయన రచనలలో ప్రకృతి వర్ణనలు ఎక్కడైనా వచ్చినా. ఏదో అయిష్టంగా ప్రకృతి రామణీయకతను వర్ణించినట్లుంటుంది.

ఇక గోర్కీ చేసిన ప్రకృతి వర్ణనలను జ్ఞప్తికి తెచ్చుకొందాము.

ఆయన ప్రకృతి ఏడుస్తుంది; ఉగ్రరూపం దాల్చి మనిషిని బాధిస్తుంది కాని మన మనస్సులో నిలిచే ప్రకృతి ముద్ర ఇది కాదు, ఒక అద్భుత సౌందర్యం. అద్వితీయమైన ప్రకృతి చిత్రాల వైవిధ్యం రష్యన్ సాహిత్యంలో–తుర్గెనీవ్‌ను కూడ మినహాయించను – వీటికి సాటిలేదు

గోర్కీ ప్రకృతిని వర్ణించడంలో తైలవర్ణ చిత్రకారుడు. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, అనిర్వచనీయమైన అంతరిక్షపు రంగులు, క్షణమొకరూపం ధరించే మేఘ మాలికలు ఏమి చేస్తున్నాయో ఒకసారి ఆకాశం వైపు తలఎత్తి చూడకుండా ఒక మనిషిని గురించి ప్రస్తావించడం, ఒక కథలో, లేదా నవలలో ఒక ప్రకరణమో ప్రారంభించడం గోర్కీకి మహా కష్టంగా వుంటుంది,

గోర్కీ రచనల్లో సముద్రం, కొండలు, అడవులు విశాలమైన మైదానాలు, చిన్నచిన్న ఉద్యానవనాలు, ప్రకృతిలో దాగివున్న సుందరదృశ్యాలు ఎన్నో

మనకు కనిపిస్తాయి. వాటిని వర్ణించడానికి ఆయన ఎంత అపూర్వమైన పదాలు వాడతారని! ఆయన చిత్రకారుడిలా ప్రకృతిని వర్ణిస్తారు. ఒక పట్టులో "మోనే" లాగా, ప్రకృతి దృశ్యంలోని వేరువేరు రంగులను, పృథక్కరించి చూపుతారు. అందుకు బహుశా మన సాహిత్యంలోనే అత్యంత విస్తృతమైన పదజాలాన్ని ఉపయోగిస్తారు. మరొక పట్టులో పేళకర్తలా, ఒక స్థూలరేఖ గీస్తారు. దృగంచలాంపరకు కనిపించే దృశ్యాన్ని ఒకే ఒక పదంలో వర్ణించగలరు. అయితేగోర్కి కేవలం చిత్రకారుడే కాదు. అతను ప్రకృతిని కవులకళ్ళతో చూస్తాడు. సూర్యాస్తమయం విషాదకరంగా ఉందనో, లేదా ఒక అరణ్యం ఏదో ఆలోచనలో మెల్లగా మాట్లాడుతున్నదనో, లేదా సముద్రం నవ్వగలదనో మనం నమ్మకుంటేనేమి? నిజంగా అరణ్యం మాట్లాడగలదు సముద్రం నవ్వనూగలదు. మానవుడు జీవం లేని మోడు అయితేనే (అయితే మానవుడు అలా ఎన్నటికీకాడు) అతనికి ప్రకృతి శక్తులలో తన మన ప్రవృత్తులు శతాధిక రూపంలో కనిపించడం ఆగిపోతుంది.

గోర్కి తన రచనల్లో ప్రకృతికి ఇంతచోటు ఎందుకిస్తున్నారు? కార్మికుడు ప్రకృతి సౌందర్యాన్ని ఏమాత్రం చూడగలరు? ఫ్యాక్టరీ ఇటుక గోడల మధ్య ఉన్న అతనికి అది కనిపిస్తుందా? కార్మికుల మురికిగూడెముల నుండి ప్రకృతి సౌందర్యాన్ని ఏనాడో తరిమివేశారు గదా?

పాతకాలపురైతుల రచయిత అయిన టాల్‌స్టాయ్‌కి ప్రకృతి అంటేఎందుకు ఇష్టంలేదో. ఎందుకు దాన్నిచూచి ఆయన భయపడుతారో అందుకే శ్రామికవర్గ రచయిత అయిన గోర్కికి ప్రకృతిపై ప్రేమ

జీవించవలసిందిగా; పోరాడవలసిందిగా జీవిత సుఖాలను అనుభవించవలసిందిగా, అయితే జంతుకోటికన్న విజ్ఞతతో, అంటే అధికతర శక్తితో చైతన్యంతో ఈ పనులు చేయవలసిందిగా ప్రకృతి మానవునికి చెబుతున్నదని ఇది వరకే పేర్కొన్నాము.

టాల్‌స్టాయ్‌ని బట్టి, క్రైస్తవ మతాన్ని బట్టి ఇది ప్రలోభ పెట్టడమే. ఇది సైతాన్ పన్నిన వల. జీవించటం, పోరాడటం అనే ఈ సూత్రం ఏ సృజనశీల శక్తిని అభివృద్ధి చేసినా, ఏ విజ్ఞాన శాస్త్రాల సహాయాన్ని తీసుకొన్నా, ఏకళలతో తన్నుతాను అలంకరించుకొన్నా, అది పాపకర్మకు, కల్మషానికి, కొంతమందిపీడ

కులను తదితరులను బలిగొనే నైతికమృత్యువుకు మాత్రమే దారితీస్తుందనిఫ్యూడల్ భూస్వామ్య, పెట్టుబడిదారీ వ్యవస్థలు రెండూ రుజువు చేశాయి,

ఇక్కడే శ్రామికవర్గం చరిత్రతో విభేదిస్తుంది; ఇక్కడే మానవజాతి మార్గాన్ని మార్చివేయాలని అది అంటుంది

శ్రామికవర్గం ఇలా చెబుతోంది; ఔను; ప్రకృతిమాతా! కళ్యాకవికరమూ లేని మా మహాతల్లీ! నీవు చెప్పేది నిజం, నీ ప్రపంచం, నీ జీవితమార్గంమంచివి. విజ్ఞత· ఐక్యత సాధించిన మానవజాతి చేతుల్లో, విశ్వ సమిష్టివ్యవస్థ చేతుల్లో అవి మహోత్తమ మవుతాయి. అప్పుడవి మేము ఊహించిన దానికన్న బాగుంటాయి. అలాంటి సంస్థను మేము సాధిస్తాము. దాన్ని నిర్మిస్తాము, అందుకు శాయశక్తులా కృషిచేస్తాము, దాన్ని ఎలా సాధించాలో ఎలా నిర్మించాలో మాకు తెలుసు· ప్రకృతీ, అప్పుడు భవిష్యత్తు సృష్టించే అద్భుతావహుడైన నూతన మానవునికి నిజంగా నీవు స్వర్గధామమే, అందువల్లనే ప్రకృతీ మేము నిన్ను ప్రేమిస్తున్నాము,

"అందువల్లనే నేను ప్రకృతిని ప్రేమిస్తున్నాను" అంటారు గోర్కీ.

మానవుని పట్ల వైఖరిలో కూడా గోర్కీకీ, టాల్‌స్టాయ్‌కి ఇదే భేదం కనిపిస్తుంది. టాల్‌స్టాయ్ తన తోడి మానవుని ప్రేమిస్తారు. సందేహంలేదు, తన తోడి మానవుని ప్రేమించాలనేది ఆయన బోధనల్లో అతి ప్రధానమయినది,అయితే ఇది ప్రయాసతో కూడిన ప్రేమ. దీని ప్రకారం మానవుని సంపూర్ణంగా ప్రేమించరాదు· అతనిలో దాగివున్న "దివ్య విస్ఫులింగాన్ని"మాత్రమే ప్రేమించాలి. మనలోని "ఈ విస్ఫులింగాన్ని" మాత్రమే, ఈ సచ్చిదానందమూర్తిని మాత్రమే ప్రేమించాలి.

టాల్‌స్టాయ్ ప్రకారం ఒక మానవునిలో ఇద్దరు మానవులున్నారు. ఒకరు దైవాంశ సంభూతుడు. ఇంకొకడు (సైతాన్) రాక్షసాంశ సంభూతుడు, శిల్పంలో ఆచంద్రార్కంగా నిల్చిపోయిన మానవుని శరీరముంది. సంగీతంలో ప్రతిబింబితమయిన కుసుమపేశలత్వమూ, ఉదగ్ర ఆవేశమూ కల హృదయముంది. విజ్ఞాన శాస్త్ర మహాద్భుతాలను సృష్టించిన మెదడు అనే అత్యాశ్చర్యకరమైన

యంత్రమున్న తలపుంది. తనూ, ఇతరులూ సుఖంగా వుండాలనే కోర్కె-లున్నాయి. (ఇక్కడ సౌఖ్యమంటే, మానవుని దేహమూ, సమిష్టి మానవజాతీ—వీటి అవసరాలను తీర్చడమన్నమాట.) ఇవన్ని సైతాన్ సృష్టి. ఈ మానవుణ్ణి టాల్‌స్టాయ్ ప్రేమించడు. వీడంటే ఆయనకు భయంకూడ. ఇతన్ని ఆయన పక్కకు తోసేస్తారు.

ఎందుకంటే, ఇతను భయంకరమైన సామాజిక వ్యవస్థకు బలియైనవాడు. అదే సమయంలో ఆసమాజసృష్టికి కారణభూతుడూ కూడా, అంతేకాదు పెట్టుబడి దారీ విధానమూ, ప్రభుత్వమూ, మతసంస్థలూ ధనదాహంతో చేసే పీడన భవిష్యత్తులో అంతకంతకు పెరగడమూ, నిరర్థకమైన రక్తప్లావిత విప్లవాలూ తప్ప భవిష్యత్తులో మానవునికి సుఖమన్నది లేదని కూడ ఆయన విశ్వాసం.

అందువల్లనే టాల్‌స్టాయ్ ప్రేమ మొదటి తరహా మానవునిపైకి మళ్ళింది. ఆ మానవుడు చేతులు జోడించుకొని, గంగిగోవులా అన్నిటికీ తలవంచుకొని పోతుంటాడు. ఆవేశపడడు. ఈ లోకానికి సంబంధించినవేమీ అతనిలో కనిపించవు. మాట్లాడితే కళ్ళకు నీళ్లువస్తాయి. సదా భగవంతునికి కృతజ్ఞత చెప్పుకొంటుంటాడు.

ప్రపంచంలో జీవిస్తూనే అతను యావత్ సంస్కృతినీ విసర్జించవచ్చు. భూమిని చిన్నచిన్న పెరళ్ళుగా విభజించి, అక్కడ తనకు కావలసిన కూర మొక్కలూ, అవీ ఇవీ పెంచి, స్వయం పోషకంగా ఎంతో హాయిగా జీవించవచ్చు. దైవప్రార్థనకు, ఆత్మశాంతికీ తప్ప అతనికి పొరుగువాడితో అవసరం లేదు. టాల్‌స్టాయ్ దృష్టిలో క్రమంగా ఈవెర్రివాళ్ళలో (ఇవీ ఆయన వీళ్ళను ఆదరంతో పేర్కొన్నతీరు—"వారి రాజ్యగాథ", పెళ్ళిళ్లు ఆగిపోతాయి. మానవజాతి సుఖంగా అంతరించిపోతుంది. అది తన కర్తవ్యాన్ని పూర్తిచేసి, ప్రకృతిజన్యమైన అరిషడ్వర్గాలను నిర్మూలించి పరమాత్మసాన్నిధ్యం చేరుకొంటుంది.

కాని గోర్కి సంపూర్ణ మానవుని ప్రేమిస్తారు; "మానవుడు — ఎంత

ఆత్మాభిమానం ఆ మాటలో మారు మోగుతోంది" అని సాతిన్ అన్నప్పుడు గోర్కీయే స్వయంగా ఆ మాటలంటున్నారు.

మనుషులు నీచంగా, దారుణంగా ప్రవర్తిస్తారని గోర్కీకి తెలుసు. ఇలాంటి వారిని గోర్కీ ద్వేషిస్తారు. అయితే వీరు అజ్ఞానులనీ, విపరీత బుద్ధులనీ, అందమైన జీవిత వృక్షంలోని చీడలనీ ఆయనకు తెలుసు

అంతే కాదు. ప్రపంచంలో నిజంగా నిర్మల హృదయం, ధైర్యం, విజ్ఞత గల మహాపురుషుల సంఖ్య ఇంకా బహు స్వల్పమనీ ఆయనకు తెలుసు.

అయితే! ఇంతమాత్రాన, ఆయన తోడిమానవుని హృదయ పూర్వకంగా ప్రేమించకుండా ఉండలేరు. మానవునిపై విశ్వాసం ఉంచకుండా వుండలేరు. ఈ విశ్వాసానికి మూలకారణం జ్ఞానం.

ఇక ప్రగతి పట్ల టాల్‌స్టాయి, గోర్కీల వైఖరి ఏమిటో చూద్దాం.

ఇక్కడ రచయితలిద్దరికీ సమానమైన విషయాలు అనేకమున్నాయి. టాల్‌స్టాయ్‌కి తాను పడ్డబాధల మూలంగా దేశభక్తిపైనా, చక్రవర్తులపైనా. ప్రభువర్గాలపైనా. పాత ఫ్యూడల్ వ్యవస్థపైనా. దాని అవశేషాలన్నింటిపైనా ఏవగింపు కలిగింది.

ఈ ఏవగింపు గోర్కీకి పుట్టుకతోనే కలిగిందని చెప్పవచ్చు.

టాల్‌స్టాయ్ పెట్టుబడిదారీ విధానమంటే తన్ని తగలేద్దామనే ద్వేషంతో చూడనారంభించారు. యూరపు సంస్కృతి పైపై మెరుగులు ఆయన మనస్సును మార్చలేకపోయాయి. పైపెచ్చు, ఆయన యూరపుకు వెళ్ళి ఆ చలువరాతి కట్టడాలు, ఆ తివాచీలు, పరదాల కిందదాగిన కుళ్ళు, అబద్ధాలను స్వయంగా చూచి ఆగ్రహావేశంతో తిరిగి వచ్చారు.

గోర్కీకూడ తన చిన్ననాటినుండీ పెట్టుబడిదారీ వ్యవస్థ బద్ధశత్రువయ్యారు. అమెరికా పచ్చని బంగారం చూచి ఆయన మోసపోలేదు. ఫ్రెంచిబూర్జువా నాగరికత ముఖంపై అసహ్యంతో ఆగ్రహంతో ఉమికారు.

పట్టణాల మధ్యతరగతి ప్రజల. రైతుల పిరికితనం, తాగుబోతుతనం, కుయుక్తులు. క్రౌర్యం జీవితంలో ఎలా ప్రదర్శితమవుతూ వుందో టాల్‌స్టాయ్ చాలవరకు చూశారు.

గోర్కీకూడా దిగ్భ్రాంతి, కౌతుకం తన్ను ముందుకు తోస్తుండగా వెళ్ళి ఓకురోవ్ గూళ్ళను త్రవ్వి, అక్కడి రొచ్చును బయట పెట్టారు.

అయినప్పటికీ, టాల్‌స్టాయ్ ఇక్కడ ఆగారు. ఏదేది పాతకాలపు రైతుల ముఖంపై పేరుకున్న మురికి అని తాము భావించారో దానినంతా కడిగివేసి, వారి తాతముత్తాతల పావిత్ర్యాన్ని వారికి సంతరింపజేశారు. పావనులైన అకిమ్‌లను గద్దె ఎక్కించారు, వారిమౌనవక్తృత్వాన్ని, "ఒకొక్కగింజ కోడిగుడ్డంత ప్రమాణంలో వున్న ధాన్యాన్ని" పేదప్రజలకు ప్రసాదించే పురాణ పురుషులను పునరుద్ధరించారు.

రైతులు ఋషితుల్యులనే కట్టుకథను పునాదిగా చేసుకొని టాల్‌స్టాయ్ మానవ జాతికి ఒక క్యాబేజి స్వర్గాన్ని నిర్మించారు.

గోర్కీకూడ ఈ అల్పజీవి వద్దనే ఆగి చూచారు. వారిలో మంచి మెరకల కోసం, గర్వకారణమైన మచ్చుతునకల కోసం, బంగారు గనిలో ముడి బంగారు ముద్దలకోసం వెదికారు. జీవిత ప్రవాహం తనకు అనుగుణంగా లేనివాని నంతటినీ గట్టుపైన ఎక్కడెక్కడ తోసివేస్తుందో అక్కడ వెదకి చూచారు. సమాజంలో అట్టడుగున, పతితులు బహిష్కృతులు, జీవితంపై మండిపడేవారు, ఆస్తి, నీతి అన్న శృంఖలాలచే బద్ధులు కానివారు, సమాజ వ్యతిరేక ప్రవర్తనలో అసహాయ శూరులు. సహజసిద్ధంగా అరాచకవాదులైనవారు—వీరందరినీ వెదకి చూచారు.

అయితే టాల్‌స్టాయ్‌కి పూర్తిగా విరుద్ధమైన ఈ పరిణామదశలో గోర్కీ చాలానాళ్ళు ఆగలేదు.

తరువాత గోర్కీ సహజంగా శ్రామికవర్గంతో, దాని అగ్రగామిదళమైన బోల్షివిక్కులతో విలీనమై పోయారు.

ఈ మహత్తర పరిణామంతో సాహిత్యంలో అద్భుతరచనలు ఉద్భవించాయి వీటిలో "శత్రువులు", "అమ్మ", "క్లింశాంగిన్" గమనార్హమయినవి.

మానవజాతి సాంస్కృతిక నిక్షేపాలపట్ల టాల్‌స్టాయ్. గోర్కీలవైఖరులలో ఉన్న పెద్ద తేడాకు సహజంగా ఇదేకారణం.

బూర్జువా విజ్ఞానశాస్త్రాల మీద, బూర్జువా కళ మీద టాల్‌స్టాయ్ ఘాటైన విమర్శలలో ఖండనలలో, చాలా నిజముంది. అయితే ఆయన, కొండనాలుకకు మందు వేయటంలో ఉన్న నాలుకను తెగ్గోశారు. ఈ నాలుక పాలకవర్గాల పుణ్యమా అని ఎంత చెడ్డా, పనికి వచ్చేదీ, గట్టిదీ. టాల్‌స్టాయ్‌లా పాతకాలపు జీవితపక్కీని అంటిపెట్టుకొన్నవారా విజ్ఞానశాస్త్రాలను. కళలను అనుమానంతో చూస్తే, శ్రామిక వర్గం వాటిని ఉత్సాహంతో స్వీకరిస్తుంది. సోషలిజంలో మాత్రమే విజ్ఞాన శాస్త్రాలు. సంస్కృతీ-అభివృద్ధి పొందగలవని దానికి తెలుసు,

గోర్కీకి కూడ ఇది తెలుసు, కాబట్టే. గోర్కీలాగా విజ్ఞానశాస్త్రమూ. కళలూ సాధించిన విజయాలచే ఉద్దీప్తులై, నూతన అద్భుతాలకోసం అంత ఉత్కంఠతో ఎదురుచూచేవారు బహు కొద్దిమంది అని నా విశ్వాసం.

... ❀ ....

# మనిషి

—గోర్కీ

తల పైకెత్తి
గర్వంగా, స్వతంత్రంగా
ముందుకు పోతున్నాడు మనిషి
మెల్లగా నడుస్తున్న నిర్దిష్టమైన నడక
కాళ్ళకింద
ఛాందసపు మట్టికొట్టుకపోతోంది
ఒంటరిగా
వెతుక్కుంటున్నాడు దారి
బలహీనతల, తప్పుల మంచులో
అతనికి
వెనుకగడచిన మేఘ సమూహం
ముందు అగమ్యమైన సమస్యలు
ఆకాశంలో మసగ్గా మెరుస్తున్న
నక్షత్రాల్లా, అతని సమస్యలు
లెక్కకు మిక్కుటం ;
కానీ అతని ప్రయాణానికి
అంతులేదు,
ఈ అవిశ్రాంతజీవి,
ఈ మనిషి,
ఎప్పుడూ ముందుకు
పోతూనే ఉంటాడు
అభ్యుదయపు బాటలో
అభివృద్ధి పథంలో........ .

**Edited, Printed and Published by : Yetukuri Prasad on behalf of A.P.**
[illegible] Association 3-6-727/3 Himayatnagar Hyderabad-29,